# మనో వికాసానికి మేటి బాట

[ కళా, సాహితీ, విజ్ఞానశాస్త్ర రంగాలలో
చైనా కమ్యూనిస్టుపార్టీ విధానం ]

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ - 2.

# విషయ సూచిక



---

# గమనిక

50 వ పేజీలో 'విభిన్న ఆలోచనా ధోరణులమధ్య పోటీ' అను శీర్షికతో ఉన్న వ్యాసం రచించినది కొ మో - జో అని పాఠకులు గమనించగోరెదము.

— ప్రచురణకర్తలు.



# "అనేక రకాల పుష్పాలను వికసించనీయండి! విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి!!"

[ కళలు, సాహిత్యం, విజ్ఞానశాస్త్రాలపై చైనా కమ్యూనిస్టుపార్టీ విధానాన్ని విశదీకరిస్తూ కేంద్రకమిటీ ప్రచురణశాఖాధ్యక్షులు లు టుంగ్-ఈ 1956 మే 26 వ తేదీన పెకింగ్‌లోని హువాయ్ జెన్ టంగ్ హాలులో చేసిన ప్రసంగం పూర్తి పాఠం ఇది.]

కళాకారులు, రచయితలు, విజ్ఞానశాస్త్రవేత్తలు సాగిస్తున్న కృషి విషయంలో చైనా కమ్యూనిస్టుపార్టీ విధానమేమిటో వివరించవలసిందని చైనా విజ్ఞానశాస్త్ర పరిషత్ అధ్యక్షులూ, అఖిల చైనా కళాకారుల, సాహితీవేత్తల సమాఖ్య అధ్యక్షులూ అయిన కోమోజో నన్ను అడిగారు.

కళాకారులకు, సాహితీ పరులకు మేము చెబుతున్నదిదే: "అనేక రకాల పుష్పాలను వికసించనీయండి!" విజ్ఞాన శాస్త్రవేత్తలకు మేము చెప్పేదిదే: "విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి!" చైనా కమ్యూనిస్టుపార్టీ రూపొందించిన విధానం ఇది. అత్యున్నతమైన వేదికనుంచి అధ్యక్షులు మావో-సే-టుంగ్ ఈ విధానాన్ని ప్రకటించారు.

ఈ విధానాన్ని అమలుజరపటంలో ఇంతవరకు మనం కొంత అనుభవం సంపాదించినమాట నిజమే. అయితే ఆ అనుభవం బహు స్వల్పమైనది మాత్రమే. మరొకవిషయం. ఈ విధానాన్ని నేను వ్యక్తిగతంగా ఎలా అర్థంచేసుకొన్నానో దానిని మాత్రమే నేడు మీ ముందుంచుతున్నాను. ఇక్కడ సమావేశమైన మీరంతా ప్రకృతి, సామాజిక శాస్త్రాలలో ప్రావీణ్యం సంపాదిస్తున్న శాస్త్ర వేత్తలు, డాక్టర్లు, రచయితలు, కళాకారులు. కమ్యూనిస్టుపార్టీ సభ్యులైనవారుకూడా కొంతమంది మీలోవున్నారు. మరికొంత మంది మిత్రులు ప్రజాస్వామిక పక్షాలకు చెందినవారున్నారు. మిగతా వారంతా నాన్ పార్టీ మిత్రులు. మీరంతా కలిసి సాగిస్తున్న కృషికి, చైనాకళారూపాలు, సాహిత్యం, శాస్త్రీయ పరిశోధనల అభివృద్ధికి ఈ విధానం ఎంతగా దోహదకారి కాగలదో మీకు నేను వేరే వివరించ నక్కరలేదు. ఒకవేళ ఏ అంశంలోనైనా నేనుపొరబడితే, నన్ను సరిదిద్దటానికి మీరు సందేహించకండి. అలా చేస్తేనే, మనమంతా కలిసిసాగిస్తున్న కృషిఫలించటానికి తోడ్పడినవాళ్ళమవుతాం.

## ఈ విధానంయొక్క అవసరం ఏమిటి?

మన దేశం బలీయమై, భోగభాగ్యాలతో విలసిల్లాలంటే, ప్రజారాజ్యాధికారాన్ని పటుతరమొనర్చటం, మన ఆర్థిక వ్యవస్థను, విద్యావ్యవస్థాయిని అభివృద్ధిచేయటం, మన జాతీయ రక్షణలను పటిష్ఠవంతమొనర్చటం మాత్రమే సరిపోదు; వాటితోపాటు మూడు పూలూ, ఆరు కాయలుగా కళలు, సాహిత్యం, విజ్ఞాన శాస్త్రం వికసించవలసిన అవసరంకూడా ఎంతేనీవుంది.

మన కళలు, సాహిత్యం, విజ్ఞానశాస్త్రం పరిపూర్ణంగా వికసించాలంటే, "అనేకరకాల పుష్పాలు వికసించడానికి" వీలైన విధానాన్ని, . "విభిన్న ఆలోచనాధోరణులు పోటీపడటానికి" అనువైన విధానాన్ని మనం అనుసరించాలి.

ఒకానొక పుష్పం ఎంతో రమణీయమైనదే కావచ్చు; అయి నప్పటికీ దానినొక్క-దానినే వికసించనిచ్చినంతమాత్రాన మన సాహిత్యం, కళలు నిజంగా సంపూర్ణంగా విలసిల్లబోవు. ఉదాహ రణకు నాటకరంగాన్నే తీసుకోండి: కొద్ది సంవత్సరాలక్రితం అసలు పెకింగ్ అపేరా ఎందుకూపనికిరాదన్న వారున్నారు. "అనేక రకాల పుష్పాలను ఒకదానిసరస మరొకటి వికసించనీయండి! పాతవాటిలో కలుపుమొక్క-లను పీకేసి, కొంగ్రొత్తవి వృద్ధిచెందనీయండి" అనే విధానాన్ని చైనా కమ్యూనిస్టుపార్టీ అప్పుడు రూపొందించింది. ఆ విధానం ఎంత సక్రమమైనదో, దానివల్ల ఎన్ని సత్ఫలితాలు సమ కూడినవో ప్రతివారికీ తెలిసిన విషయమే. స్వేచ్ఛావాతావర ణంలో పోటీజరిగినందువల్లనూ, అన్నిధోరణులవారు ఒకరినుంచి మరొకరు పరస్పరం నేర్చుకొన్నందువల్లనూ మన నాటకరంగం ఎంతో ముందుకు పోగలిగింది.

పోతే విజ్ఞానశాస్త్ర రంగం విషయంలో, మనం గ్రహించ వలసిన చారిత్రక అనుభవం వుంది. రెండువేల సంవత్సరాలకు పూర్వమే, అంటే క్రీస్తుకు పూర్వం 722-481 మధ్య కాలంలోను, క్రీస్తుకుపూర్వం 403-221 మధ్య కాలంలోను విభిన్న ఆలోచనా ధోరణులు ఒకదానితో మరొకటి పైచేయి సంపాదించటంకోసం పోటీపడ్డాయి. చైనా మేధాశక్తి ప్రవర్ధమానమైన స్వర్ణయుగం అది. స్వతంత్ర ఆలోచనాశక్తికీ, స్వేచ్ఛాయుతమైన చర్చకు ప్రోత్సాహం లభించకపోతే, విద్వత్ జీవనం (ఎకడమిక్) స్తంభించి పోతుందని చారిత్రకానుభవం మనకు చాటిచెబుతోంది. కాగా, వాటికి ప్రోత్సాహం లభిస్తే, విద్యత్ అభివృద్ధి ఉరకలు పెట్టు కుంటూ ముందుకు సాగిపోతుంది, ఇంతకీ, ఆనాటి ప్రాచీనకాలపరి స్థితులకు, ఈనాటి పరిస్థితులకు చాలా వ్యత్యాసం వుందనుకోండి. ఆ రోజులలో సమాజం సంక్షుభితమై వుంది. విభిన్న ఆలోచనా ధోరణులు ఒకదానితో మరొకటి పోటీపడుతూ, విభిన్న అభి ప్రాయాలను బహుళంగా వ్యాప్తిలోకి తెచ్చాయి. అయితే ఆ

పోటీ యాదృచ్ఛికంగా- సద్యోజనితంగా మాత్రమే సంభవించింది. చైతన్యవిలసితమైన సుసంఘటిత నాయకత్వం ఆ నాడు లేదు. కాగా ఇప్పుడు ప్రజలు తమంతటతాము స్వతంత్ర ప్రపంచాన్ని సంపాదించుకొన్నారు. నూతన ప్రజాతంత్ర నియంతృత్వం నెలకొని, పటిష్టవంతమైంది. విజ్ఞానశాస్త్రం నిరవధికంగా, నిరాఘాటంగా జైత్రయాత్ర సాగించేందుకు వున్న అవరోధా లన్నింటినీ తొలగించాలన్న అభిలాష ప్రజా వాంఛగా పరిణమించింది. అందుచేత మనం చైతన్యంతో విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి అనువైన సర్వతోముఖ పథకాన్ని రూపొందించుకొని, విద్వత్ అభివృద్ధికి ప్రోద్బలమిచ్చే, ప్రోత్సాహమిచ్చే విధానాన్ని, విభిన్నాలోచనా ధోరణులు ఒకదానితో మరొకటి పోటీపడటానికి అనువైన విధానాన్ని అనుసరించగలుగుచున్నాం.

## వర్గపోరాటంలో ఆయుధాలు

వర్గాలుగల సమాజంలో, ఎన్ని మాయమాటలు చెప్పినా కళలు, సాహిత్యం, విజ్ఞానం - ఇవన్నీకూడా వర్గపోరాటంలో ఆయుధాలుగా వినియోగించబడతాయనటం నిర్వివాదాంశం.

ముఖ్యంగా కళలు, సాహిత్యం విషయంలో ఇది అక్షరాలా వర్తిస్తుంది. కళా, సాహిత్యరంగాలలో ప్రజలపాలిటి అశనిపాతం వంటివి మనకు స్పష్టంగా కన్పిస్తాయి. అందుకు ఉదాహరణగా హు ఫెంగ్ రచనలనే తీసుకోవచ్చు. పచ్చిబూతులతో నిండిన సాహిత్యం, రొచ్చుగుంట సాహిత్యం ప్రజల మనస్సులను మలినపర్చి, వారిని హంతకులుగా మార్చుతుంది. మరొకరకం సాహిత్యం కూడా వుంది. "ప్రభుత్వ వ్యవహారాలు గంగలో కలవనివ్వండి; మనమట్టుకు మనం జూదం ఆడుకొందాం", "చైనాలో కన్నా అమెరికాలో చంద్రబింబం మరింత గుండ్రంగా వుంటుంది" వంటి సాహిత్యం యీ బాపతుకు చెందినదే. ఇలాంటి అత్యంత హానికరమైన సాహిత్యాన్ని మనం తోటకూరలో పురుగులాగా,

"ఈగలు, దోమలు, ఎలుకలు, ఉడతలలాగా" చూడవలసిందే. [చైనాలో ఈగలను, దోమలను, ఎలుకలను, ఉడుతలను "నాలుగు అరిష్టాలు"గా పరిగణిస్తారు. పంటలను, ఆహార పదార్థాలను నాశనంచేసే తెగుళ్ళకు అవే కారణభూతాలు కనుక ప్రజలువాటిని అలా పరిగణిస్తారు.] అలాంటి సాహిత్యాన్ని తోటకూరలో పురుగు లాగా ఏరిపారేసిందువల్ల మన సాహిత్యం లాభపడుతుందేగానీ, నష్టపడదు. ఆవిధంగా కార్మికులకు, కర్షకులకు, సైనికులకు సహాయ పడేసాహిత్యమూ, కళలూ, సామ్రాజ్యవాదులకు, భూస్వాములకు, పెట్టుబడిదారులకు తోడ్పడే సాహిత్యమూ, కళలూ అంటూ రెండు రకాలున్నాయని మనం అభిప్రాయ పడుతున్నాం. కార్మికులకు, కర్షకులకు, సైనికులకు సహాయపడే సాహిత్యం, కళలూ అంటే ప్రజలకు తోడ్పడే కళలూ, సాహిత్యమూ మనకు కావాలి.

తత్వశాస్త్రం, సామాజికశాస్త్రాలలో వర్గపోరాటం ప్రతి బింబిస్తున్న సంగతి స్పష్టంగా దృగ్గోచరమవుతుంది. తత్వశాస్త్రం చరిత్ర, విద్య, రాజకీయాలపైన హుషీ వెల్లడించిన భావాలు ప్రజ లలో ద్వేషభావం జనింపజేశాయి. * అతని అభిప్రాయాలు తిరస్కరించబడటం సామాజిక శాస్త్రరంగంలో వర్గపోరాటాన్ని సూచిస్తోంది. అతని అభిప్రాయాలను మనం నిరసించటం పూర్తిగా

---

* హుషీ 1917 లో ఒక నూతన సంస్కృతికొరకు ప్రారంభమైన ఉద్యమంలో పాల్గొన్నాడు. గ్రాంధికభాషకు బదులు వ్యావహారికభాషను ఉపయోగించాలని ఆయన వాదించాడు. తర్వాత, 1919 నాటి "మే నాలుగు" ఉద్యమానికి సంబంధించిన సాంస్కృతికోద్యమం పురోగమిస్తున్నప్పుడూ, ప్రజల్లో మార్క్సిస్టు - లెనినిస్టు భావాలు వ్యాపిస్తున్నప్పుడూ సోషలిజానికి వ్యతిరేకంగా విప్లవ కార్యాచరణకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాదుల - దళారీ పెట్టుబడిదారుల (కాంప్రడోర్ బూర్జువా) పక్షం వహించాడు. అత్యంత అభివృద్ధి నిరోధకమైన స్వీయాత్మకమైన, భావవాద పూరితమైన రూపంలో ప్రాగ్మాటిజంను (తత్వశాస్త్రంలో ఒకశాఖ) అతి తీవ్రంగా బలపరిచాడు. దాన్నుంచి చిన్నచిన్న సంస్కరణలను అమలుజరపాలనే కొమింటాంగ్ సిద్ధాంతాలనూ, బూర్జువా వ్యక్తివాద తత్వశాస్త్రాన్నీ బలపరచేస్థితికి వెళ్ళాడు.

సమర్థనీయమైనదే. మనం లియాంగ్ సోలింగ్ అభిప్రాయాలను నిరసించటంకూడా పూర్తిగా సమంజసమైనదే. ♦ బూర్జువా భావవాదం, బూర్జువా సామాజిక శాస్త్రాలకు చెందిన ఇతర తాత్విక ఆలోచనా ధోరణులను ఖండించటం కూడా సరియైనదే.

---

రాజకీయంగా అతడు యుద్ధప్రభువుల పాలనను సమర్థించాడు; సన్ యెట్ సేన్ నాయకత్వాన పనిచేసిన విప్లవవాదుల్ని వ్యతిరేకించాడు. 1927 లో చాంగ్ కై-షేక్ విప్లవానికి ద్రోహంచేసిన తర్వాత అతడు చాంగ్-కై-షేక్ నియంతృత్వ పాలననూ, సామ్రాజ్యవాదుల పెత్తనాన్నీ బలపరచే వ్యక్తిగా తయారయాడు. నాటినుంచి నేటివరకు అతడు కమ్యూనిస్టుపార్టీకి, ప్రజావిప్లవానికి శత్రువుగా ఉన్నాడు. అమెరికన్ సామ్రాజ్యవాదులపైన, చాంగ్-కై-షేక్ పైన ఆధారపడే నమ్మినబంటుగా వ్యవహరిస్తున్నాడు. ఈ కారణంవల్ల చైనా జాతి అంతా అతన్ని తిరస్కరిస్తోంది.

హుషీ పాతకాలపు చైనా విశ్వవిద్యాలయాల్లోను, విద్వత్ పరిషత్తుల లోను అనేక ప్రముఖస్థానాలాక్రమించేవాడు. ఆవిధంగా తన అభివృద్ధి నిరోధక సిద్ధాంతాలను వ్యాప్తిచేయ గలిగాడు. అట్టివర్గాల్లో అతని విషపూరిత ప్రభావం కొంత మిగిలివుంది. కనుక నే దేశం విముక్తిచెందిన తర్వాత, అబ్సుల్యూరాంటిజంకు (తత్వశాస్త్రంలో ఒకశాఖ) వ్యతిరేకంగా జరిగిన సాధారణ విమర్శల్లో అతని భావాలు తీవ్రంగా ఖండింప బడ్డాయి.

♦ లియాంగ్-సోలింగ్ 1919 నాటి "మేనాలుగు" ఉద్యమంలో నూతన సంస్కృతికోసం జరిగే పోరాటాన్ని వ్యతిరేకించాడు. పాత ఫ్యూడల్ సంస్కృతిని కొద్దిపాటి సంస్కరణలతో అలాగే అట్టిపెట్టాలని అతడు వాదించాడు. తర్వాత "గ్రామీణ పునరుద్ధరణోద్యమం" అంటూ ఒకటి ప్రారంభించాడు. దాని ఉద్దేశం, లియాంగ్ - సోలింగే చెప్పినట్లు, కమ్యూనిస్టుపార్టీ నడుపుతున్న రైతుఉద్యమాన్ని ప్రతిఘటించడం. చైనాలో దోపిడీ వర్గాలే లేవని అతడు వాదించాడు. రైతులకూ - భూస్వాములకూ మధ్య సహకారం ఉండాలన్నాడు. పాతవ్యవస్థను కాపాడ్డానికి భూస్వాములు స్వయంగా నెలకొల్పిన సాయుధ దళాలను బలపరిచాడు. రైతుల్లో ఫ్యూడల్ భూస్వామ్య భావాలను ప్రచారం చేయడానికి రైతాంగ పాఠశాలల స్థాపనను సమర్థించాడు. సామ్రాజ్యవాదుల పన్నాగంలోపడి, పారిశ్రామికాభివృద్ధిని వ్యతిరేకించాడు. చైనా వ్యవసాయ దేశంగానే ఉండాలని వాదించాడు. విముక్తి తర్వాత అతడు ప్రజాప్రభుత్వాన్ని బలపరిచాడు. అఖిలచైనా ప్రజారాజకీయ సమాలోచన సంఘం యొక్క జాతీయ కార్యవర్గంలో సభ్యుడయాడు. లియాంగ్ భావాలు సహజంగా తీవ్రవిమర్శలకు లోనవుతున్నాయి.

పోతే, ప్రకృతిశాస్త్రాలనుగురించి ఆలోచిద్దాం. ప్రకృతి శాస్త్రాలు స్వతహా వర్గస్వభావం కలవి కాకపోయినప్పటికీ, శాస్త్ర వేత్తలందరికీ కొన్ని రాజకీయ అభిప్రాయాలు వుంటాయి. ప్రకృతి శాస్త్రాలలో ప్రావీణ్యం సంపాదించినవారిలో కొందరు గతంలో అమెరికాను గుడ్డిగా ఆరాధించారు; కాగా ఇతరులు "రాజకీయాలకు దూరంగా" వున్నట్టు వ్యవహరించారు. ఇలాంటి అవాంఛనీయమైన వాటిని విమర్శించటం సరియైనది; సమంజసమైనది. వర్గపోరాటం యొక్క ప్రతిబింబమే ఆ విమర్శ.

వర్గపోరాటానికీ, కళలు, సాహిత్యం, విజ్ఞాన శాస్త్రాలకూ మధ్య సన్నిహిత సంబంధంవున్నప్పటికీ, రాజకీయాలూ, కళలు, సాహిత్యం, విజ్ఞానశాస్త్రాలూ ఒకటేనన్నట్టు ఏకగాటిని కట్టటం సరికాదు. రాజకీయపోరాటం అన్నది వర్గపోరాటానికి ప్రత్యక్ష రూపం. కాగా, కళలు, సాహిత్యం, సామాజిక శాస్త్రాలు ఒక్కొక్కప్పుడు ప్రత్యక్షంగాను, మరొకప్పుడు డొంకతిరుగుడు పద్ధతిలోను వర్గపోరాటాన్ని ప్రతిబింబిస్తూవుంటాయి. కళలు, సాహిత్యం, విజ్ఞానశాస్త్రాలకు, రాజకీయాలకు అసలు సంబంధంలేనే లేదనటమూ, "కళ కళకోసమే" "విజ్ఞానశాస్త్రం విజ్ఞానశాస్త్రం కోసమే" అనటం సరియైనదేననిభావించటమూ విషయాలను పాక్షిక దృష్టితోను, సంస్కరణవాద దృష్టితోను పరికించటంతప్ప మరొకటి కాదు. విషయాలను ఆ విధంగా పరికించటం పూర్తిగా పొరపాటు. అలాగే కళలు, సాహిత్యం, విజ్ఞానశాస్త్రాలు రాజకీయాలవంటివే అనటంకూడా పూర్తిగా పొరపాటే. అదికూడా పాక్షికదృష్టి; "అతివాద" పోకడ. అందువల్ల రెండో దృక్పథంకూడా అంతే పొరపాటు.

## భావస్వాతంత్ర్యం

"అనేక రకాల పుష్పాలను వికసించనీయండి! విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడనీయండి" అంటే స్వతంత్ర ఆలోచనకు

వాదోపవాదాలకు, సృజనాత్మకృషికి స్వేచ్ఛ ఒసగాలనీ, విమర్శనా స్వాతంత్ర్యాన్ని, భావప్రకటనా స్వేచ్ఛను కలుగజేయాలనీ, కళలు, సాహిత్యం, శాస్త్రపరిశోధనకు సంబంధించిన విషయాలలో భిన్నాభిప్రాయం కలిగియుండే హక్కు ఒసగాలనీ మన ఉద్దేశం. *

---

* విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడనీయాలనే విధానాన్ని వ్యాఖ్యానించడంలో గాడితప్పకుండా శ్రద్ధవహించాలని హెచ్చరిస్తూ చాలమంది విజ్ఞానశాస్త్రవేత్తలు ఉత్తరాలు వ్రాశారు. విజ్ఞానశాస్త్ర ప్రచురణాలయానికి చెందిన యాంగ్ చావో-లియవ్ వ్రాసిన ఉత్తరంలో కొన్ని భాగాలను యిక్కడ ఉదహరించడం మంచిది. అతడిలా వ్రాశాడు :

“విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడనీయాలన్న విధానం పూర్తిగా సరియైన సూత్రమే ననడంలో ఎట్టిసందేహంలేదు. అయితే, వ్యాఖ్యానించేటప్పుడు ఆచరణలో వక్రమార్గా లవలంబించే ప్రమాదం ఉంది.

“ఆ శబ్దప్రయోగంలో సూచింపబడ్డట్లు, పోటీపడేవారు యించుమించు ఏదో ఒక ఆలోచనావిధానాన్ని బలపరుస్తూన్నట్లు గుర్తింపబడ్డవారై యుండాలి. కాని కొందరు అలాకాకుండా, జ్ఞానాన్ని పైపైన మాత్రమే తడిమేవారున్నారు. అట్టివారు ఏదో ఒకవిషయం పట్టుకొని, తామే సర్వజ్ఞులమైనట్లు భావిస్తారు; తమ పరిశోధనలను మరింతగా కొనసాగించడానికి నిరాకరిస్తారు. విద్వత్ పరిశోధనలో కట్టుదిట్టమైన మార్గం చేబట్టరు; బురదలో ఒకసారిపడి, యెలా బయటపడాలో తెలుసుకోరు. నిజంచెప్పాలంటే, వారు తమ పొరపాట్లను గట్టిగా పట్టుకొని వేళ్ళాడుతూ, యథార్థాన్ని గుర్తించ నిరాకరిస్తారు. ఇందుకొక ఉదాహరణ చెబుతాను. కేవలం కంపాస్ ద్వారాను, రూలర్ సహాయంతోను ఒక కోణాన్ని మూడు సమభాగాలుగా విభజించడం అసాధ్యమని యించుమించు అందరూ అంగీకరిస్తున్నారు. అలాగే, నిరంతరం చలనంలో ఉండే యంత్రాన్ని నిర్మించడం కూడా అసాధ్యమని అంతా గుర్తిస్తున్నారు. కాని కొందరు, ఒక అద్భుత విషయాన్ని కనిపెట్టగలమనే ఆశతో తమ మెదడును వ్యథపెడుతూ కాలాన్ని వృథాచేస్తారు. ఇట్టి అర్థరహితమైన, నిరర్థకమైన ప్రయత్నాల్లో తమ శక్తినంతా వృథాచేసేవారు గణనీయమైన సంఖ్యలోనే వున్నారు. అట్టివారిలో కొందరు అకస్మాత్తుగా ఒక ‘ఆలోచనాధోరణి’ని కనిపెట్టే అవకాశం కలిగిందికదా అని సంతసించడం, అట్టి అవకాశాన్ని వినియోగించుకొన చూడడం అసంభవమేమీ కాదు. అలాంటివారు దీర్ఘకాలం పరిశోధనలు చేయవలసిన బాదరబందీ లేకుండా అకస్మాత్తుగా పోటీలో పాల్గొని యితరులను ఆశ్చర్యచకితుల నొనర్చవచ్చు. అట్టివారికి మీరు, అదివరకే గట్టి ఆధారాలతో నిర్ధారణ చేయబడ్డ విషయాలను

గురించి కష్టపడి పరిశోధనలు జరపవలసిందని సలహా యిచ్చారనుకోండి. వెంటనే వారు 'అది బూర్జువా విద్వాంసులచే సృష్టింపబడ్డ సిద్ధాంతం; భావవాదానికది చెందుతుంది!' అంటూ ఫెళ్లున కొట్టినట్లు జవాబు చెబుతారు. ఇది స్వానుభవం ద్వారా చెబుతున్న మాట.

ఇలాంటిదే మరొక ఉదాహరణ చెబుతాను. మనలో కొంతమంది ఇంజనీర్లు, ముఖ్యంగా సాంకేతిక నిపుణులు ఉన్నారు. వారి పనికి సంబంధించిన డాక్యుమెంట్లు తదితర సాధనాలు వారికి అందుబాటులో ఉండవు. వారుచేసేపని యొక్క స్వభావమే అలాంటిది. అట్టివారు ఏ ప్రమాణ గ్రంధాలనూ చదవకుండా, యితరుల సలహాలు లేకుండా ఏదో ఒకవిధంగా వస్తువులను తయారుచేయడంలో చాల శ్రమపడతారు. చివరకు తమ సమస్యను ఎలాగో ఒకలాగు సరిగానే పరిష్కరించుకోగల్గుతారు. కాని, దురదృష్టవశాత్తు, అదివరకే ఒకరు కొన్ని దశాబ్దాలక్రిందటే యీ విషయాన్ని కనిపెట్టారన్న విషయం చిట్టచివరకైనా గుర్తించరు!

“ఒకవ్యక్తి నిజంగా విద్వాంసుడు కావాలంటే, ఒక ఆలోచనా ధోరణికి ప్రతినిధి కావాలంటే, దానిపై గట్టిగా నిలబడి పోటీచేయాలంటే అనేక సంవత్సరాలు కష్టపడి పనిచేయాలి; ఆచరించాలి. పైసూత్రాన్ని అర్థంచేసుకోడానికది కనీస కర్తవ్యం. ఈ విషయాన్ని నొక్కిచెప్పడం అవసరమని భావిస్తున్నాను. దీన్ని మనం దృష్టిలో ఉంచుకోకపోతే వివిధ పరిశోధక మండలులు, ఉన్నత విద్యాసంస్థలు అనేకమంది 'విద్వాంసుల' 'విభిన్న ఆలోచనాధోరణులను కనిపెట్టిన వ్యక్తుల' పరిశోధనా ఫలితాలను గుర్తించక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది. వాటి లోతుపాతుల్లోకిపోయి, అవెలా అసాధ్యమో ఓపికతోను, జాగ్రత్తగాను నచ్చచెప్పవలసివస్తుంది. లేదా వాటిని యితరులు అదివరకే కనిపెట్టారని రుజువుచేయవలసివస్తుంది. ఇది అందరికీ వృధాశ్రమ అనేమాట స్పష్టం. అలా కాకుండా, 'విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడనీయండి!' అనే సిద్ధాంతాన్ని సరిగా అర్థం చేసుకుంటే శ్రమను సాధ్యమైనంతవరకు తగ్గించవచ్చు; నిరర్థక కృషిని ఉపయోగకరమైన మార్గాలకు మళ్ళించవచ్చు.”

యూంగ్ వెలిబుచ్చిన అభిప్రాయాలు, అనేకమంది యితర శాస్త్రవేత్తలు వెలిబుచ్చిన అభిప్రాయాలు విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయాలన్న విధానం వక్రమార్గంలో వ్యాఖ్యానించకుండా జాగ్రత్తపడేందుకు ఉద్దేశింపబడ్డాయి. అవి వారి సొంత అనుభవాలపై ఆధారపడివున్నాయి; హేతుయుక్తముగా వున్నాయి. ఆ విధంగా వక్రభాష్యాలుచేసే పద్ధతిని మనం నివారించవలసిందే—రచయిత.

మనం కావాలంటున్న స్వాతంత్ర్యం బూర్జువావర్గం కోరే ప్రజాస్వామ్యం వంటిదికాదు. బూర్జువావర్గంకోరే స్వాతంత్ర్యం సమాజంలోని అల్పసంఖ్యాకులకు మాత్రమే వర్తిస్తుంది; అధిక సంఖ్యాకులైన శ్రమజీవులకుమాత్రం ఈషణ్మాత్రం స్వాతంత్ర్యం అందులో వుండదు. బూర్జువావర్గం శ్రమజీవులపై నియంతృత్వం అమలుజరుపుతోంది. అమెరికాలోని జాతీయదురహంకారులు "స్వేచ్ఛా ప్రపంచం" గురించి బాకా లూదుతుంటారు-ఆ స్వేచ్ఛా ప్రపంచంలో జాతీయదురహంకారులకు, అభివృద్ధి నిరోధకులకు సంపూర్ణమైన స్వేచ్ఛ, సకల స్వాతంత్ర్యాలు వుంటాయి; శాంతి కోసం గట్టిగా పోరాడిన రోజన్‌బర్గు దంపతులవంటివారిని మాత్రం ఉరికంబాలు ఎక్కిస్తారు. "స్వేచ్ఛాప్రపంచం"లో వుండే స్వాతంత్ర్యం అలాంటిది! కాగా, ప్రజాసామాన్యానికి ప్రజాతంత్ర పౌరస్వాత్వాలుండాలనీ, విప్లవ ప్రతీఘాతకులకు మాత్రం ఎలాంటి స్వాతంత్ర్యమివ్వరాదనీ మనం అంటాం; విప్లవ ప్రతీఘాతకుల విషయంలో మనం నియంతృత్వం అమలు జరుపుతాం. ఇది రాజకీయ సరిహద్దును ఏర్పరచుకోటానికి సంబంధించినసమస్య. మిత్రునికీ, శత్రువుకీమధ్య స్పష్టమైన రాజకీయ తేడాను మనం పాటించాలి.

"అనేకరకాల పుష్పాలను వికసించనీయండి! విభిన్న ఆలోచనాధోరణులను పోటీ పడనీయండి!" అంటే ప్రజలకు స్వాతంత్ర్యం ఉండాలనే మనభావం. నూతన ప్రజాతంత్ర రాజకీయాధికారం పటిష్ఠవంత మవుతున్నకొలదీ అలాంటి స్వాతంత్ర్యం మరింత పరిపూర్ణంగా పరిఢవిల్లాలని మనం వాంఛిస్తాం.

ప్రజలలో కొన్ని ఏకాభిప్రాయాలు, కొన్ని భేదాభిప్రాయాలు వుంటాయి. మనదేశానికి ఒక రాజ్యాంగచట్టం వుంది. ఆ రాజ్యాంగ చట్టంలోని నిబంధనలను పాటించడం ప్రజలందరి విధ్యుక్తధర్మం. ఆ విషయంలో ప్రజలందరూ ఏకాభిప్రాయాన్నే కలిగియున్నారు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, తమ మాతృదేశాన్ని ప్రేమించాలనీ, సోషలిజాన్ని బలపర్చాలనీ వారంతా

ఏకాభిప్రాయానికి వచ్చారు. అయితే వారు ఒకరితో మరొకరు ఏకీభవించలేని విషయాలు యింకా అనేకం వున్నాయి. సిద్ధాంత రంగానికి సంబంధించినంత వరకు, భౌతికవాదానికీ, భావవాదానికీ తేడాలున్నాయి. దృక్పథానికి సంబంధించిన ఈ తేడాలు వర్గాలున్నంతవరకే వుంటాయనుకోటం పొరపాటు. వర్గాలు అంతరించి పోయిన తర్వాతకూడా చివరకు కమ్యూనిస్టు సమాజంలో సైతం ఆ తేడాలుండక తప్పదు. సమాజంలో వర్గాలున్నప్పుడు, భౌతిక వాదానికీ, భావవాదానికీ మధ్య వైరుధ్యం వివిధ వర్గాలమధ్య వైరుధ్యంగా పరిణమిస్తుంది. వర్గాలు అంతరించి పోయినతర్వాత స్వీయభావానికీ, భౌతికమైన వాస్తవానికీమధ్య, ముందుచూపుకూ వెనుకచూపుకూ మధ్య, సమాజంలోని ఉత్పత్తిశక్తులకూ ఉత్పత్తి సంబంధాలకూమధ్య వైరుధ్యాలువున్నంతకాలమూ, భౌతికవాదానికీ భావవాదానికీమధ్య సోషలిస్టు సమాజంలోను, కమ్యూనిస్టు సమాజంలోనుకూడా వైరుధ్యం వుంటూవస్తుంది. భౌతికవాదానికీ భావవాదానికీ మధ్య జరిగే సంఘర్షణ దీర్ఘకాలికమైనది.

## భావవాదం, భౌతికవాదం

కమ్యూనిస్టుపార్టీ సభ్యులు గతితార్కిక భౌతికవాదులు. కమ్యూనిస్టులమైన మనం భౌతికవాదాన్ని సమర్థిస్తాం; భావ వాదాన్ని వ్యతిరేకిస్తాం. అందులో మార్పుఏమీవుండబోదు. అయితే మనం గతితార్కిక భౌతికవాదులం కనుకనే, సమాజపరి ణామక్రమాన్ని తీర్చిదిద్దుతున్న సూత్రాలేమిటో మనకు తెలుసు. కనుకనే, ప్రజలమధ్య కొనసాగే భావసంఘర్షణకూ, విప్లవ ప్రతీ ఘాతకులకు వ్యతిరేకంగాసాగే పోరాటానికీమధ్య తేడాను స్పష్టంగా గుర్తిస్తాం. ప్రజలు తమలో తాము భౌతికవాదాన్ని మాత్రమే కాక, భావవాదాన్నికూడా ప్రచారంచేసుకొనే స్వాతంత్ర్యం కలిగి యున్నారు. విప్లవ ప్రతీఘాతకుడు కానంతవరకు, ఎవరైనాసరే తమ యిష్టమొచ్చినవాదాన్ని, భౌతికవాదాన్నిగానీ, భావ

వాదాన్నిగానీ యథేచ్ఛగా ప్రచారంచేసుకోవచ్చు. ఆ రెండు వాదాలమధ్య వాద వివాదాలు యథేచ్ఛగా సాగించుకోవచ్చు. ఈ పోరాటం ప్రజలమధ్య కొనసాగే భావసంఘర్షణ మాత్రమే. అయితే విప్లవప్రతీఘాతకులకు వ్యతిరేకంగా కొనసాగే పోరాటం విషయంవేరు. విప్లవప్రతీఘాతకుల కార్యకలాపాలను నామ రూపాలులేకుండా మనం అణచివేయాలి. ప్రజలలోగల సనాతన భావాలకు, భావవాద భూయిష్టమైన ఆలోచనాధోరణికి వ్యతిరేకంగాకూడ మనం పోరాడాలి. ఈ పోరాటం నిశితమైనపద్ధతిలో సాగినా సాగవచ్చు. అయితే ఐక్యతను పటుతరంచేయాలన్న దృష్టితోను, సనాతనభావాలనుపోగొట్టి, ప్రజలలో మరింత సన్నిహితమైన సంఘీభావం కొనిరావాలన్న దృష్టితోను మనం ఈ పోరాటం సాగిస్తాం. భావాలకు సంబంధించిన సమస్యలను పరిపాలనా సంబంధమైన చర్యలద్వారా పరిష్కరించబూనటంవల్ల ఎట్టి ప్రయోజనం కలుగదు. బాహాటమైన వాదవివాదాల ద్వారామాత్రమే, భౌతిక వాదం క్రమేణా భావవాదాన్ని జయించగల్గుతుంది. *

---

* చైనాలో భావవాదాన్ని ప్రచారంచేయడానికెవరికీ స్వేచ్ఛఉండగూడదని కొందరు అభిప్రాయపడుతున్నారు. మరికొందరు, భావవాదాన్ని ప్రచారం చేయడానికి స్వేచ్ఛ ఉంది గనుక ఎట్టి పరిమితులు లేకుండా భావవాదాన్ని ప్రచారం చేయడానికి స్వేచ్ఛ ఉండాలని అభిప్రాయపడుతున్నారు. ఈ రెండూ పొరపాటు అభిప్రాయాలే. ఉదాహరణకు మతాన్నే తీసుకుందాం. నేడు మన దేశంలో వివిధ మతసంస్థలకు చర్చిలు, దేవాలయాలు, మసీదులు ఉన్నాయి; సొంత ప్రచురణలు, ప్రచురణాలయాలు ఉన్నాయి. మతబోధకుల్ని తరిఫీదు చేసేందుకు సొంత స్కూళ్లు ఉన్నాయి. ఇవన్నీ ఉంచుకోడానికి వాటికి స్వేచ్ఛ ఉంటుంది. వాటిని ప్రభుత్వం రక్షిస్తుంది. అయితే, ఆస్తికుల - నాస్తికుల మధ్య ఐక్యత ఉండడానికి, వారిమధ్య సంఘర్షణలు జరక్కుండా చూడ్డానికి, నాస్తికులు చర్చిలలోను, దేవాలయాలలోను, మసీదులలోను మతానికి వ్యతిరేకంగా ప్రచారం చేయరు; అలాగే ఆస్తికులు తమ మత సిద్ధాంతాలను చర్చిల బయట, దేవాలయాల బయట మసీదులబయట బహిరంగ సమావేశాల్లో ప్రచారం చేయరు. ఈ విధంగా ఆస్తికులు, నాస్తికులు తమ అభిప్రాయాలను ప్రచారం చేసుకోటంలో కొన్ని పరిమితులున్నాయి.

కేవలం కళాత్మకమైన, విద్యుత్ సంబంధమైన, సాంకేతిక మైన విషయాలలోకూడా భిన్నాభిప్రాయాలుండి తీరుతాయి. అలా వుండటం సహజంకూడా. ఇలాంటి విషయాలలో భిన్నాభిప్రాయం వ్యక్తీకరించేందుకు, విమర్శించేందుకు, ప్రతి విమర్శచేసేందుకు, వాదోపవాదాలు సాగించేందుకు పూర్తి స్వేచ్ఛవుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే, మిత్రునికీ, శత్రువుకీ మధ్య స్పష్టమైన రాజకీయ తేడాను పాటిస్తూ, ప్రజలకు స్వాతంత్ర్యం ఒసగాలి. కళలు, సాహిత్యం, విజ్ఞాన శాస్త్రాల విషయంలో ప్రజలకుగల పూర్తి స్వేచ్ఛ "అనేకరకాల పుష్పాలను వికసించనీయండి! విభిన్న ఆలోచనాధోరణులను పోటీపడనీయండి" అన్న విధానంలో స్పష్టంగా వ్యక్తమాతుంది.

## నేటి పరిస్థితులు

ఈ విధానం అమలుజరపటానికి నేడు పరిస్థితులు పరిపక్వమై వున్నాయి. ఈనాడున్న పరిస్థితు లేమిటో పరిశీలిద్దాం.

మొదటి విషయం: సోషలిస్టు పరిణామ కృషికి సంబంధించిన ప్రతి అంశంలోను దేశంలోని ముఖ్య ప్రాంతాలన్నింటిలోను నిర్ణయాత్మకమైన విజయం సాధించాం. రానున్న కొలది యేళ్లలోను ఈ ప్రాంతాలన్నింటిలో "ఒక వ్యక్తిని వేరొకవ్యక్తి పీడించే సాంఘికధర్మం" తుదముట్టించ బడుతుంది. లోగడ దోపిడీదారులుగా ప్రవర్తించినవారు ఇకముందు స్వయంగా కష్టపడి పనిచేసుకొనే శ్రమజీవులుగా మారిపోతారు. దోపిడీ వర్గాలులేని సోషలిస్టు దేశంగా మనదేశం తయారవుతుంది.

రెండవవిషయం: చైనా మేధావుల రాజకీయ దృక్పథంలో సమూలమైనమార్పు వచ్చింది. ఇంకా ముఖ్యమైన మార్పు వస్తోంది. కామ్రేడ్ చౌఎన్-లై ప్రవేశపెట్టిన "మేధావుల సమస్యపై నివేదిక"లో ఈ విషయం గురించి వివరంగా చర్చించారు. ఈ

సందర్భంలోనే ఇటీవల మనం సాగించిన పోరాటాన్ని సూక్ష్మంగా సమీక్షించు కొందాం.

బూర్జువావర్గ భావవాదానికి వ్యతిరేకంగా మనం సిద్ధాంత సమరం సాగించాం. ఆ సమరంలో మేధావులలో అత్యధికులు చక్కని పాత్ర నిర్వహించారు; వారు గణనీయమైన అభివృద్ధిని సాధించారు.

ఈ సిద్ధాంత పోరాటంలో విద్వత్ వర్గాలవారు విప్లవ ప్రతీఘాతకులైన హూషీ, హూఫెంగ్‌లపై దృష్టిని ప్రధానంగా కేంద్రీకరించి, నిప్పులు చెరిగారు. వారిద్దరూ కేవలం భావవాదులు మాత్రమేకాదు. రాజకీయంగా వారిద్దరూ విప్లవ ప్రతీఘాతకులు. లియాంగ్ సోలింగ్‌యొక్క తాత్విక, సామాజిక, రాజకీయ దృష్టిని కూడా మనం నిశితంగా విమర్శించాం. అలాగే కళా, సాహితీ వర్గాలలోని కొందరిలో యిప్పటికీగల బూర్జువా అహంభావ పూరితమైన భావాలనుకూడా మనం ఖండించాం. సోషలిస్టు పరివర్తన నిరాఘాటంగా కొనసాగాలంటే ఈ పోరాటం కొనసాగించటం ఎంతో అవసరమని యిప్పుడు అంతా గుర్తిస్తున్న విషయమే.

## పార్టీ కేంద్రకమిటీ వివరణ

ఈ పోరాట సమయంలో చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ, విద్వత్ విమర్శనకు, చర్చకు అంతరాయంగా పరిణమించిన భావాలన్నింటినీ గట్టిగా ప్రతిఘటించాలని స్పష్టం చేసింది. హానికరమైన అలాంటిభావాలు అనేక రూపాలలో వ్యక్తమయ్యాయి. బూర్జువావర్గంయొక్క "ధృవతారలను" ఆరాధిస్తూ, ఆ "ధృవ తారలు" విమర్శకు అతీతాలైనవిగా పరిగణించి, పూజించే తప్పుడు ధోరణి వాటిలో ఒకటి. అలాగే యువక మార్క్సిస్టులను వెనకకు నెట్టివేసి, వారిని డబాయిస్తూ నోరుమూయించే బూర్జువా అవలక్షణం మరొకటి. కొంతమంది పార్టీసభ్యులు తామేదో 'అధికారులమ'ని భావించుకొంటూ, విమర్శనను సహించటానికి నిరాకరిం

చారు; ఇకవారు ఆత్మవిమర్శ అనేది చేసుకోనేలేదు. మరికొంత మంది పార్టీసభ్యులు "ఐక్యసంఘటన ఎక్కడ విచ్ఛిన్నమైపోతుందో" అన్న భీతితోను, "ఐక్యతకు ఎక్కడ భంగంవాటిల్లుతుందో"నన్న భయంతోను ఇతరులను విమర్శించటం పూర్తిగా మానివేశారు. ఇంకా మరికొందరు వ్యక్తిగతస్నేహాన్ని పురస్కరించుకొని, "మొఖం తప్పించాలన్న" దృష్టితో యితరుల పొరపాట్లను విమర్శించ లేదు; పైగా వాటిని మభ్యపర్చటానికి ప్రయత్నించారు.

విద్వత్ విమర్శ, చర్చల విషయంలో, ఎంత గొప్ప వారైనప్పటికీ విమర్శకుమాత్రం అతీతులుకారు అన్న సూత్రాన్ని తు. చ. తప్పకుండా పాటించాలని పార్టీ కేంద్రకమిటీ స్పష్టం చేసింది. ఎవరైనాసరే "అధికారంతో" విమర్శను అణచాలనటం గానీ, పొరపాటు జరుగుతూంటే చూస్తూ చూడనట్లు పోవటం గానీ, బూర్జువా భావాలను అరికట్టకపోవటంగానీ, బండి పట్టాలు తప్పుతూంటే చూస్తూ మిన్నకుండటంగానీ, చివరకు తప్పుడు భావాలకు లొంగిపోవటంగానీ పూర్తిగా పొరపాటు.

నచ్చజెప్పటం, హేతుపటిమ, వాస్తవిక విషయాలను చిత్త శుద్ధితో పరిశీలించటం – వీటి ప్రాతిపదికపైననే నిర్మాణాత్మక విమర్శను, చర్చలను కొనసాగించాలని పార్టీ కేంద్రకమిటీ స్పష్టీక రించింది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, సచేతనమైన విమర్శను, సశాస్త్రీయమైన విమర్శను మనం ప్రోత్సహించాలి. జాగ్రత్తగా జరిపిన పరిశోధన, అధ్యయనాలను ఆధారం చేసుకొని విమర్శను, చర్చలను కొనసాగించాలి. అంతేకాని, బుకాయింపులతోను, డబాయింపులతోను వాటిని సాగించరాదు. స్వేచ్ఛాయుతమైన చర్చలకు పూర్తి అవకాశం కలుగజేయాలి. అంతేకాని అధికార తాఖీదులు జారీచేయరాదు. విమర్శకు గురిచేయబడిన వ్యక్తి తిరిగి సమాధానం చెప్పుకొనేందుకు అవకాశమివ్వాలి. ప్రతి విమర్శనను (కౌంటర్ క్రిటిసిజం) నొక్కివేయటం తగదు. అల్ప సంఖ్యాకులు భిన్నాభిప్రాయం కలిగియుండటాన్ని అనుమతించాలి.

అల్పసంఖ్యాకులు అధికసంఖ్యాకుల అభిప్రాయాన్ని ఆమోదించాలి అన్న సూత్రం ఈ విషయంలో వర్తించదు. విద్వత్ సమస్యల విషయంలో పొరపాట్లు చేసినవారు విమర్శ, చర్చలు జరిగిన తర్వాతకూడా తాము తప్పుచేసినట్లు అంగీకరించకపోతే వారిని అంతటితో వొదిలివేయాలి; తప్పులు దిద్దుకుంటూ వ్యాసాలను ప్రకటించాలని వారిపై వత్తిడి తేరాదు. విద్వత్ ప్రపంచంలో, ఏదైనా ఒక సమస్యపై నిర్దిష్టమైన నిర్ధారణచేసిన తర్వాతకూడా ఆ సమస్యపై కొత్తకొత్త అభిప్రాయ భేదాలు ఏర్పడినప్పుడు యింకా చర్చను కొనసాగనీయవచ్చు.

విద్వత్ సమస్యలపై విమర్శ, చర్చలు కొనసాగించే సందర్భంలో, తప్పుడు భావాలను, బూర్జువాభావాలను విమర్శించేటప్పుడు పార్టీరూపొందించిన విధానాలను – ఐక్యసంఘటనను కాపాడాలన్న విధానాన్నీ, మేధావులతో సమైక్యమై, వారిలో మానసిక పరివర్తన తీసుకురావాలన్న విధానాన్ని – తు. చ. తప్పకుండా పాటించాలనికూడా కేంద్రకమిటీ స్పష్టంచేసింది. తప్పుడు బూర్జువాభావాలకు అంటిపెట్టుకొన్న వారినీ, బూర్జువాభావాలకు అంటిపెట్టుకొంటూనే భౌతికవాదంవైపు క్రమంగా మొగ్గుతున్న వారినీ మనం ఒకే గాటకట్టరాదు. అలాంటివారి విషయంలో భిన్న పద్ధతులను అవలంబించాలి. రాజకీయంగా విప్లవప్రతీఘాతకులైన వారికీ, విద్వత్ రంగంలో పొరపాట్లుచేసేవారికీ మధ్య తేడాను మనం ఖచ్చితంగా గుర్తించాలి. విద్వత్ రంగంలో తీవ్రస్వభావంకల్గిన తప్పిదాలు చేసిన, బూర్జువాభావాలనుకలిగియున్న విద్వత్ప్రముఖులు, విప్లవ ప్రతీఘాతక కార్యకలాపాలలో పాల్గొనకపోయిన పక్షంలో, అలాంటివారందరికీ సముచితమైన బాధ్యతలు తప్పక అప్పగించాలి. అలాంటివారు సమాజానికి శ్రేయోదాయకమైన పద్ధతిలో పరిశోధన కృషిసాగించేటట్టుచూడటం మన కర్తవ్యం. సమాజానికి లాభదాయకమైన విశిష్టపరిజ్ఞానం వారిలోవున్న పక్షంలో వారిని మనం గౌరవించాలి; వారికున్న పరిజ్ఞానాన్నంతా పూర్తిగా వినియో

గించుకుంటూ, అది యువజనులకు సక్రమించేటట్లు చూడటం మన విధి. విద్వత్ విమర్శలలోను, చర్చలలోను పాల్గొనేటట్లు వారిని మనం ప్రోత్సహించాలి; ఆ విధంగా వారిలో క్రమానుగతమైన మానసిక పరివర్తనకొని రావడానికి మనం తోడ్పడాలి.

## మనం చేసిన కృషి

ఈ సూచన లన్నింటి ఫలితంగా, విద్వత్ వర్గాలలో విమర్శల ద్వారా బూర్జువా భావవాదాన్ని ప్రతిఘటించ గలిగాం; అదే సమయంలో తాడు తెగేదాకా లాగకుండా అరికట్టగలిగాం. ఈ విషయంలో ఇంతవరదాకా మనం సాగించిన కృషిని ఒకసారి సింహావలోకనం చేసుకొంటే స్పష్టమయ్యేదేమిటి? మొత్తంమీద ఈ పోరాటాన్ని మనం సక్రమంగానే సాగించామని చెప్పవచ్చు; ఏవిధంగా చూసినా హానికరమైన తప్పిదాలను మనం చేయ లేదు. అయితే కొన్ని లోపాలు, పొరపాట్లు జరగకపోలేదు. యూపింగ్ పో ను విమర్శించినతీరు ఇందుకొక ఉదాహరణ. రాజకీయాలకు సంబంధించినంతవరకు, యూపింగ్‌పో నిరాక్షేపణీయమైన వ్యక్తి. ఆయన చేసిన పొరపాట్లన్నీ సాహితీరంగానికి మాత్రమే పరిమితమై వున్నాయి. విద్వత్ దృష్టినుంచి, సిద్ధాంత దృక్పథంనుంచి ఆయనను విమర్శించటం సరియైనదే. యూపింగ్‌పో పైన వెలువడిన అనేక వ్యాసాలు చాలా బాగావున్నాయికూడా. కాని కొన్ని వ్యాసాలుమాత్రం అంత బాగా లేవనే చెప్పాలి; నచ్చజెప్పే పద్ధతిలో ఆ వ్యాసాలు వ్రాయబడ లేదు. వాటిలో తీవ్రపద జాలం వాడారు. "చాలా అరుదుగా లభ్యమయ్యే ప్రాచీన మైనా గ్రంథాల ఉపయోగాన్ని ఆయన గుత్తకు తీసుకొన్నాడు" అన్న ఆరోపణకు అసలు ఆధారం ఏమీ కన్పించదు. ఈ విషయాన్ని నేను స్పష్టం చేయదలచుకొన్నాను.

ఇంతవరకు గతానికి సంబంధించిన విషయాలనే పరిశీలించాం; ఇక ప్రస్తుత పరిస్థితులకు వద్దాం.

ఈనాటి పరిస్థితి చాలా భిన్నమైనది. ఒకటి రెండు సంవత్సరాల క్రితంవరకు బూర్జువా భావవాదం బహుళ వ్యాప్తిలో వుంది. సిద్ధాంత రంగంలో ఉధృతమైన దాడులు ప్రారంభించ టానికి కూడా హూపెంగ్ వంటివారు వెనుదీయలేదు. భావ వాదానికి, భౌతికవాదానికి మధ్యగల తేడాను అనేకమంది మేధా వులు గుర్తించగలిగిన స్థితిలో అప్పుడు లేరు. భావవాదంవల్ల సోష లిజానికి సంభవించేహాని ఎలాంటిదో వారు అప్పుడు గ్రహించగల్గిన స్థితిలో లేరు. కాని ఇప్పుడు పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. విద్వత్ వర్గాలలో అపారమైన పురోభివృద్ధి సాధించబడింది.

హూపెంగ్, హూషీల అభివృద్ధి నిరోధక భావాలకు వ్యతిరే కంగా కొన్ని సంస్థలలో ప్రచారం తగినంతగా సాగించబడలేదు; చాటుమాటున దాగివున్న విప్లవ ప్రతీఘాతకులను బయటకులాగి హతమార్చే కార్యక్రమం యింకా పూర్తి చేయబడలేదు. అందు చేత అలాంటి సంస్థలలో ఆ కార్యక్రమాన్ని మధ్యలో ఆపివేయ కుండా పూర్తిచేయాలి. అలా చేస్తేనే ఉత్తరోత్తరా మనం చేయవలసిన అనేక పనులు సుకరం అవుతాయి. ఆ సంస్థలలో పనిచేస్తున్నవారిలో నూటికి 90 మందికి పైగా నిజాయితీపరులైన సామాన్యప్రజలు (వారిలో కొందరు కాస్త సనాతనులై వుంటే వుండవచ్చు). విప్లవ ప్రతీఘాతకులకు వ్యతిరేకంగా సాగించే పోరాటంలోకి వారందరినీ తీసుకురావలసి వుంటుందన్న విషయాన్ని ఒకటికి పదిసార్లు గుర్తుంచుకోవాలి.

మూడవవిషయం: మనకు యింకా శత్రువుల పీడ వదల లేదు. గ్రామీణప్రాంతాలలో వర్గపోరాటం యింకా సాగుతూనే వుంది. శత్రువులకోరలు, ముఖ్యంగా గ్రామీణప్రాంతాలలోని శత్రువులకోరలు మనం యింకా పూడబెరకవలసివుందన్న విష యాన్ని గుర్తుంచుకోండి.

ఈ శత్రువులు ఎవరు? అమెరికాలోని జాతీయ దురహం కారుల నాయకత్వాన గల విదేశసామ్రాజ్యవాద దురాక్రమణ

శక్తులు మనపై దెబ్బతీయటానికి గుంటకాడ నక్కల్లాగా యింకా కాపేసుకొని కూర్చొన్నాయి. పోతే, దేశంలో చూదామూఅంటే, తైవాన్‌లో తిష్టవేసుకొని కూర్చొన్న చ్యాంగ్ కై షేక్ ముఠా, దేశంలో యింకా తుంగమొదళ్ళులాగా అక్కడక్కడ మిగిలిపోయిన విప్లవప్రతీఘాతకులు వుండనేవున్నారు. వారే మన శత్రువులు. వారికి వ్యతిరేకంగా మనం పట్టువిడుపులులేని పోరాటం సాగిస్తుండాలి. వారి విషయంలో ప్రమత్తత ఏమాత్రం పనికిరాదు.

నాల్గవ విషయం; ప్రజలలో రాజకీయ, సిద్ధాంత సంఘీభావం బాగా పటిష్ఠవంతమైంది,. ఆ సంఘీభావం దిన దిన ప్రవర్ధమానమవుతోంది.

పరిస్థితులు యిలా సుముఖంగా మారినందువల్లనే అనేక రకాల పుష్పాలను వికసించనీయండి, విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి అని చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ యిప్పుడు వక్కాణిస్తోంది. ఈ విధానం అనుసరిస్తున్నందువల్ల, సమాజ శ్రేయస్సుకు దోహదకరమైన శక్తులన్నింటినీ వినియోగంలోకి తీసుకొచ్చి, ప్రజలకు యితోధికంగా సేవచేయటానికి వీలవుతోంది; కళలు, సాహిత్యం పూర్తిగా వికసింపచేసేందుకు మనశక్తి యుక్తులన్నింటినీ కుప్పపోయ సాధ్యపడుతుంది. మన విజ్ఞానశాస్త్ర కృషిని ప్రపంచంలోకల్లా ఉత్తమ స్థాయిలోవున్న వాటిస్థాయికి చేర్చగలం.

ప్రభుత్వ సారధ్యం క్రింద అనేకమంది విజ్ఞాన వేత్తలు ప్రకృతి శాస్త్రాల అభివృద్ధికి పన్నెండు సంవత్సరాల ప్రణాళికను రూపొందించటంలో ప్రస్తుతం నిమగ్నమై వున్నారు. అలాగే తత్వశాస్త్రం, సామాజికశాస్త్రాల అభివృద్ధికి కూడా పన్నెండేళ్ళ ప్రణాళికను రూపొందిస్తున్నారు. ఆ ప్రణాళికలను రూపొందించి, జయప్రదంచేసే గురుతర కర్తవ్యం మన విజ్ఞాన శాస్త్రవేత్తలందరిపైన వుంది. ఈ కర్తవ్యాన్ని జయప్రదంగా నిర్వహించేందుకు విభిన్న

ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి అన్న విధానం బాగా తోడ్పడగల దనటం నిర్వివాదాంశం.

## 2. మన ఐక్యతను పటుతర మొనర్చాలి

పలురకాల పుష్పాలను వికసించనీయండి; విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడనీయండి అన్న విధానం సృజనాత్మకమైన శక్తులన్నింటినీ సమీకరించటానికి చక్కని సాధనంగా ఉపయోగ పడుతుంది. అందుచేత ఐక్యతను పటుతరం చేయటానికి కూడా అది తోడ్పడుతుంది.

ఏ ప్రాతిపదికపైన ఆ ఐక్యత సాధించాలి? దేశభక్తి, సోషలిజాలను ఆధారంచేసుకొని ఆ ఐక్యత సాధించాలి.

ఆ ఐక్యతయొక్క లక్ష్యం ఏమైవుండాలి? నూతన సోషలిస్టు చైనాను నిర్మించటం, ఇంటా బయటాగల శత్రువులను ప్రతిఘటించటం.

ఐక్యత అన్నది రెండురకాలుగా వుంటుంది. ప్రతివిషయంలోను గంగిరెద్దులాగా తలూపే పద్ధతిపై సాధించే ఐక్యత ఒకరకం; అలా కాక, చైతన్యంతో, స్వచ్ఛందపద్ధతిలో సాధించే ఐక్యత రెండో రకం. మనకు కావలసింది రెండోరకం ఐక్యతమాత్రమే.

కళలు, సాహిత్యం, విజ్ఞానశాస్త్రరంగాలలో పనిచేస్తున్న వారంతా ఏకత్రాటిపై సమీకృత మయ్యారా? సమీకృతమయ్యారనే చెప్పవచ్చు. చైనా ప్రజారాజ్యం నెలకొన్న తొలిరోజుల లోని పరిస్థితిని నేటి పరిస్థితిని పోల్చిచూసుకోండి. కళాకారులు, రచయితలు, విజ్ఞానశాస్త్రవేత్తలమధ్య ఈనాడు సన్నిహిత సంఘీభావం కలదన్న సంగతి మీకే స్పష్టంకాకమానదు. ఇదంతా సామాజిక సంస్కరణలకోసం మనం సాగించిన కృషిఫలితమే; మన ఆలోచనాధోరణిలో వచ్చిన మార్పుల పర్యవసానమే. దీనిని కాదనటంకానీ, గుర్తించ నిరాకరించటంకానీ పొరపాటే అవుతుంది. అయితే ఈ విషయంలో మనం సాధించవలసినదంతా యిప్పటికే

సాధించివేశామని అనుకోరాదు. పరిస్థితిని మెరుగుపర్చవలసిన అవసరం యింకా లేకపోలేదు.

## ఒంటెత్తు పోకడ

ఈ విషయంలో మనం గమనించవలసిన మొట్టమొదటి విషయం ఒకటి వుంది : ఒంటెత్తు పోకడవల్ల ఉత్పత్తిల్లే అరిష్టాలను గురించి కామ్రేడ్ మావో సేటుంగ్ చేసిన హెచ్చరికను కమ్యూనిస్టు పార్టీ సభ్యులలో కొందరు అప్పుడే మరచిపోయారు. కొంత విజయం సిద్ధించగానే కొందరి తలలు తిరిగిపోతాయి. దానితో వారు తల పొగరుకొద్దీ ఒంటెత్తుపోకడలకు ఉపక్రమిస్తారు.

"పార్టీపని రీతులను సంస్కరించండి" అంటూ 1942 లో కామ్రేడ్ మావో సేటుంగ్ చేసిన ప్రసంగంలో ఇలా పేర్కొన్నారు :

"మన కామ్రేడ్స్‌లో అనేకమంది నాన్‌పార్టీ ప్రజలముందు ఎక్కడలేని ఆర్భాటం చేస్తున్నారు; వారిని తూష్ణీభావంతో చూస్తున్నారు. వారిని గౌరవించ నిరాకరిస్తున్నారు. వారిలోని సుగుణాలను గుర్తించ నిరాకరిస్తున్నారు. నిజంగా ఇది ఒంటెత్తు పోకడకాక మరేమిటి ? ఏవో నాలుగైదు మార్క్సిస్టు గ్రంథాలను చదివిన ఈ కామ్రేడ్స్ నమ్రతతో ప్రవర్తించటానికి మారు అహంభావంతో వ్యవహరిస్తున్నారు; ఇతరులు అసలు ఎందుకూ పనికిరానివారని త్రోసిపారేసే దురలవాటు ఆ కామ్రేడ్స్‌కు అబ్బింది. వాస్తవానికి తామింకా ఓనమాలు నేర్చుకొంటున్నవారేనన్న సంగతీ, తమకు మిడిమిడి జ్ఞానం మాత్రమే వున్నదన్న విషయమూ ఆ కామ్రేడ్స్ గుర్తించటంలేదు. నాన్‌పార్టీ ప్రజలతో పోల్చితే మనపార్టీసభ్యులసంఖ్య అత్యల్పంగానే వుందన్న వాస్తవాన్ని మన కామ్రేడ్స్ గమనించాలి. ఒకవేళ చైనా జనాభాలో ప్రతి వంద మందికి ఒక కమ్యూనిస్టు చొప్పున వున్నప్పటికీ, 45 కోట్ల జనాభాలో 45 లక్షలమంది మాత్రమే కమ్యూనిస్టులుంటారు. మన

పార్టీ సభ్యత్వం అంత విపరీతమైన సంఖ్యకు పెరిగినప్పుడు సైతం జనాభాలో నూటికి 1 వంతు మాత్రమే మనం ఉంటాం. మిగిలిన 99 వంతులు పార్టీ వెలుపలనే వుండిపోతారు. అయినప్పుడు ఏ ధీమా చూసుకొని మనం నాన్‌పార్టీ వారితో సహకరించ నిరాకరించ గలం? మనతో సహకరించటానికి సిద్ధంగా వున్న లేక సహకరించటానికి అవకాశమున్న వారందరితోను మనం సహకరించి తీరాలి; అంతేకాని వారిని దూరంచేసే హక్కు మనకెంత మాత్రం లేదు. కాని, దీనినిగుర్తించలేని కొంతమంది పార్టీసభ్యులు మనతో సహకరించటానికి సిద్ధంగావున్నవారిని తుష్ణీభావంతో త్రోసిపారేస్తున్నారు; చివరకు వారిని దూరం చేస్తున్నారు కూడా. అలా చేయటం పూర్తిగా పొరపాటు. మార్క్స్, ఎంగిల్స్, లెనిన్, స్టాలిన్‌లు అలాచేయమని ఎక్కడన్నా చెప్పారా? ఎక్కడా చెప్పనేలేదు. పైగా, మనం ప్రజలతో సన్నిహితంగా మసలుకోవాలనీ, ప్రజలకు దూరం కారాదనీ వారు పదేపదే స్పష్టంచేశారు. పోనీ, చైనా కమ్యూనిస్టుపార్టీ అలాచేయమని చెప్పిందా? చెప్పనేలేదే! ప్రజలనుంచి మనం దూరమై, ఒంటరిగా నిలబడవచ్చునని చెప్పే నిర్ణయాన్ని కేంద్రకమిటీ ఎన్నడూ ఆమోదించలేదు. పైగా, ప్రజలకు సన్నిహితంగా మసలుకోమనీ, ఎన్నడూ వారికి దూరంకావద్దనీ కేంద్రకమిటీ మనలను ఆదేశిస్తూ వచ్చింది. అందుచేత మనలను ప్రజలనుంచి దూరంచేసే చర్యలకు పార్టీ ఆమోదముద్ర వుందనటం సర్వాబద్ధం. ఒంటెత్తు పోకడ నరనరాన జీర్ణించుకు పోయిన కొంతమంది కామ్రేడ్స్ సృష్టించే కల్పితగాధ మాత్రమే అది. మన పార్టీ సభ్యులు కొందరిలో యింకా తీవ్రమైన ఒంటెత్తు పోకడలు మిగిలివున్నాయి; పార్టీ విధానాన్ని అమలు జరపటంలో ఆ పోకడలు అడ్డంకులుగా వున్నాయి. కనుక ఆ ఒంటెత్తు పోకడలను పూర్తిగా రూపు మాపేందుకు పార్టీలోపల పెద్ద ఎత్తున విద్యాప్రచారం సాగించాలి. ఆ సమస్య అసలు ఎంతటి తీవ్రస్వభావం కలిగివుందో మొదట మన కార్యకర్తలు గ్రహించేటట్లు,

గుర్తించేటట్లు తెలియజెప్పాలి. అలాగే నాన్‌పార్టీ కార్యకర్తల తోను, ప్రజలతోను కమ్యూనిస్టులు సమైక్యం కాకపోతే శత్రువును ఓడించటంగానీ, విప్లవధ్యేయాన్ని చేరుకోటంగానీ ఏ మాత్రం సాధ్యంకాదని వారికి స్పష్టపర్చాలి" (మావో సేటుంగ్ సెలెక్టెడ్ వర్క్సు, సంపుటి : 4, పేజీలు 42, 43 – లారెన్స్ – విషార్ట్ ప్రచురణ – 1956).

గత కొలదిసంవత్సరాలలోను కళా, సాహిత్య, విజ్ఞానశాస్త్ర వర్గాలలో ఒంటెత్తుపోకడకు వ్యతిరేకంగా పార్టీలోపల మనం అనేక పోరాటాలు సాగించాం. ప్రజారోగ్యానికి, ప్రకృతి శాస్త్ర పరిశోధనకు సంబంధించిన సంస్థలలోను, సాహిత్య, కళా సంస్థల లోను, సామాజిక శాస్త్రాలకు సంబంధించిన సంస్థలలోను ఈ పోరాటం కొనసాగించాం. దానిని మనం ఇంతటితో వదలిపెట్ట బోము. ఈ రంగాలలో పనిచేస్తున్న పార్టీ సభ్యులంతా ఒంటెత్తు పోకడలను విడనాడాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

## మన అనుభవం

ఈ పోరాటాలలో మనం కొంత అనుభవం సంపాదించాం. ఆ అనుభవం గురించి ఇక్కడ కొంత ప్రస్తావిస్తాను :

1. వైద్యశాస్త్రంతోసహా ప్రకృతిశాస్త్రా లన్నింటికీ వర్గ స్వభావంలేదన్న విషయం అందరికీ తెలిసిందే. వాటి పరిణామ సూత్రాలు వాటి కున్నాయి. చెడ్డ సామాజికవ్యవస్థలో అవి తాబేటి తీరుగా నడకసాగించితే, మంచి సామాజికవ్యవస్థలో త్వరితంగా అభివృద్ధి చెందుతాయి. వాటికీ, సామాజికసంస్థలకూ మధ్యగల సంబంధమల్లా అదే. ఈ సమస్యకు సంబంధించిన సిద్ధాంతం చాలాకాలంక్రితమే నిర్ధారణఅయిపోయింది. అందుచేత వైద్యశాస్త్రం, జీవశాస్త్రం, లేదా ప్రకృతిశాస్త్రాలలోని మరి ఏ యితరశాఖలకు సంబంధించిన ఏ సిద్ధాంతాన్నయినా "ఫ్యూడల్" అనో, "పెట్టుబడిదారీ"అనో, "సోషలిస్టు"అనో, లేక "శ్రామికవ

అనో ముద్రవేయటం పూర్తిగా పొరపాటు. ఉదాహరణకు "సంప్రదాయసిద్ధమైన చైనావైద్యులు ఫ్యూడల్ వైద్యులు" అనటం పొరపాటు; అలాగే "పాశ్చాత్యధోరణిగల వైద్యులు పెట్టుబడిదారీ వైద్యులని"గానీ, "పావ్‌లోవ్ సిద్ధాంతం సోషలిస్టు సిద్ధాంతమని"గానీ అనటం పొరపాటు. అదేవిధంగా "మిచూరిన్ సిద్ధాంతం సోషలిస్టు సిద్ధాంతం"అనిగానీ, "మెండెల్, మోరగాన్‌ల వంశపారంపర్య సూత్రాలు పెట్టుబడిదారీ సూత్రాలు"అని గానీ ముద్రవేయరాదు. అలాంటి చెత్తను మనం విశ్వసించరాదు. కొందరు ఇలాంటి పొరపాటే చేస్తున్నారు. వారిలో ఒంటెత్తు పోకడ వుండటమే అందుకు కారణం. సోవియట్ యూనియన్‌లో సాధించబడిన ఆధునిక శాస్త్ర విజయాలనుంచి మనం నేర్చుకోవలసిందే; అయితే కొందరు దీనికి లేనిపోని ప్రాధాన్యతనిస్తూ, అనుకోకుండా పొరపాటు చేస్తున్నారు. ఈ పొరపాటులన్నీ విభిన్న కారణాల నుంచి ఉత్పన్నమవుతున్నాయి. అందుచేత వీటన్నిటినీ గుదిగుచ్చరాదు; ఆయా నిర్దిష్ట పరిస్థితులను దృష్టిలో వుంచుకొని వీటిని పరిశీలించవలసి వుంటుంది.

ఇలాంటి పొరపాట్లన్నిటినీ ఎత్తి చూపుతూనే, మరొక విషయాన్ని కూడా పేర్కొనవలసివుంది : పావలోవ్, మిచూరిన్ సిద్ధాంతాల ప్రాధాన్యాన్ని కొందరు గుర్తించ నిరాకరిస్తున్నారు. ఈ సిద్ధాంతాల ప్రాధాన్యాన్ని గుర్తించ నిరాకరిస్తున్న వారందరినీ ఒకేగాట కట్టరాదు. కొందరు సోవియట్ యూనియన్‌పట్ల తమకు గల రాజకీయ వ్యతిరేకతకొద్దీ, సోవియట్ యూనియన్ అసలు విజ్ఞానశాస్త్ర విజయాలనే సాధించలేదు అనేదాకా పోతున్నారు. మరికొందరి ఆలోచనా ధోరణి భిన్నంగా వున్నందువల్ల ఆ సిద్ధాంతాలను అంగీకరించలేక పోతున్నారు. మొదటిరకంవారు రాజకీయదృక్పథంనుంచి ఆ సిద్ధాంతాలను వ్యతిరేకిస్తుంటే, రెండో రకంవారు విద్వత్ ఆలోచనా దృష్టినుంచి వాటిని ప్రతికూలిస్తు

న్నారు. అందుచేత ఈ పొరపాట్లనుకూడా ఒకే గాటను కట్టక దేనికిదానినే ప్రత్యేకంగా పరిశీలించాలి.

## శ్రామికప్రజలు, సాహిత్యం

2. సాహిత్యం, కళలకు సంబంధించినంతవరకు పార్టీ చెప్పేది ఒకటే. "కార్మిక, కర్షకులకు, సైనికులకు" లేదా నేటి పరిస్థితులకు వర్తింపచేసి చెప్పాలంటే మేధావులతోసహా మొత్తం శ్రామికజనానీకానికంతటికీ కళలు, సాహిత్యం సేవచేసేవిగా వుండాలి. సోషలిస్టు వాస్తవికత అన్నది మన దృష్టిలో అత్యంత ప్రయోజనకారియైన సృజనాత్మక పద్ధతి. అయితే ప్రతి ఒక్కరూ ఆ పద్ధతినే విధిగా స్వీకరించి తీరాలని మనం పట్టుబట్టటం లేదు. కార్మికులు, కర్షకులు, సైనికుల అవసరాలను తీర్చగల్గిన పక్షంలో రచయితగానీ, కళాకారుడుగానీ తనకునచ్చిన పద్ధతిని చేపట్టే స్వేచ్ఛగలిగియున్నారు. ఈవిషయంలో ఇతరులతో అతను స్వేచ్ఛగా పోటీపడవచ్చు. పోతే, యితివృత్తానికి సంబంధించినంత వరకు పార్టీ ఎన్నడూ గిరిగీయలేదు. కేవలం కార్మికులను గురించీ, రైతులను గురించీ లేదా సైనికులను గురించీ మాత్రమే వ్రాయాలని ఆదేశించటం పొరపాటు. అలాగే కేవలం నూతన సమాజం, నూతనతరహా వ్యక్తులను గురించి మాత్రమే వ్రాయాలని పట్టుపట్టటం కూడా పొరపాటే. సాహిత్యం, కళలు కార్మిక కర్షకులకు, సైనికులకు సేవచేసేవిగా వుండాలంటే, మనం నూతన సమాజాన్నీ, ప్రగతిశీల వ్యక్తులను కొనియాడక తప్పదు. అయితే అదేసమయంలో మనం పాతసమాజాన్ని, క్షీణశక్తులను విమర్శించకా తప్పదు. అభ్యుదయ కరమైన దానిని మనం పొగడాలి; వెనుకచూపుగల శక్తులను తెగడాలి. అందుచేత సాహితీరంగంలో ఎలాంటి ఇతివృత్తం స్వీకరించాలి అన్నవిషయంలో కావలసినంత అవకాశంవుంది. సృజనాత్మక రచనలలో కేవలం కంటికి కన్పించే విషయాలే వుండనక్కర లేదు; అసలు ఎన్నడూ కంటికి కన్పించని విషయాలుకూడా,

వాస్తవంగాని విషయాలుకూడా – స్వర్గంలోని దేవుళ్ళు, మాట్లాడే పక్షులు, జంతువులు, యితర విషయాలుకూడా – ఆ రచనలలో వ్యక్తమవుతుంటాయి. ప్రగతిశీల వ్యక్తులను గురించీ, నూతన సమాజం గురించీ వ్రాయవచ్చు; అలాగే క్షీణశక్తులను గురించీ, పాతసమాజం గురించీకూడా వ్రాయవచ్చు. పాతసమాజాన్ని చిత్రించకపోతే, కొత్తసమాజంయొక్క ప్రయోజనాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించటం కష్టమవుతుందన్న సంగతినికూడా మనం గుర్తుంచుకోవాలి. క్షీణశక్తులతో ప్రగతిశీల శక్తులనుపోల్చి చూపించినప్పుడే అది మనకు సుకరమవుతుంది. ఫలానా రకం ఇతి వృత్తాన్ని మాత్రమే తీసుకోవాలంటూ ఆదేశాలిచ్చినందువల్ల కళలు, సాహిత్యం వడలిపోయిన పుష్పంలాగా తయారవుతాయి; రచనలు రసాభాసంగా తయారవుతాయి. అలాంటి ఆదేశాలవల్ల హానిమాత్రమే వాటిల్లుతుంది. పోతే, సాహిత్యం కళలకు సంబంధించిన నిర్దిష్టగుణగణాలు, విశిష్టపాత్రల సృష్టి మొదలైనవి రచయితలు, కళాకారులూ స్వేచ్ఛగా చర్చలు సాగించి, నిర్ణయించవలసిన విషయాలు. క్రమేణా ఏకాభిప్రాయానికి వచ్చేదాకా వారిని వాదోపవాదాలు కొనసాగించ నివ్వాండి.

నాటకరంగానికి సంబంధించినంతవరకు, "అనేక రకాల పుష్పాలను సహజీవనం నెరపుకోనిస్తూ, కాలంతీరిపోయిన పాత వాటిని కలుపుతీసి, కొత్తవి ప్రవర్థమానం కావటానికి అవకాశం కల్పించండి" అన్న సూత్రాన్ని అమలుజరపటంలో మనం కొంత అనుభవం సంపాదించాం. ఆ అనుభవం అత్యంత అమూల్యమైనది. ఇప్పుడు మనం చేయవలసిందల్లా, సాహిత్యం, కళలకుచెందిన ఇతర శాఖలకు కూడా ఆ సూత్రాన్ని వర్తింపచేయటమే.

## తత్వశాస్త్ర, సామాజికశాస్త్ర రంగాలు

3. తత్వశాస్త్ర, సామాజికశాస్త్రరంగాలలో మనం ఘన విజయాలుసాధించాం. అయితే సరిగా ఆ కారణంవల్లనే ఒంటెత్తు

పోకడయొక్క ప్రమాదంకూడా చాలా ఎక్కువగా వుంటుంది. ఈ ప్రమాదాన్ని మనం సరిగా గుర్తించకపోయిన పక్షంలో, మానసిక స్తబ్దతే సంప్రాప్తించే ప్రమాదంవుంటుంది. చైనాలో ప్రజారాజ్యం ఏర్పడినతర్వాత మేధావులకు మార్క్సిజం - లెనినిజం పెద్దఎత్తున బోధించబడుతోంది. మానసిక పరివర్తన తీసుకొచ్చేందుకు మనం కొన్ని ఉద్యమాలు కొనసాగించాము. బూర్జువాభావవాదానికి వ్యతిరేకంగా పోరాటాలుసాగించాం; దాగొనియున్న విప్లవప్రతీఘాతకులను ఏరిపారేసే కార్యక్రమం అమలుజరిపాం. ఈ కార్యకలాపాలన్నీ సరియైనవే; అనివార్యమైనవే. వాటివల్ల ఎన్నో సత్ఫలితాలు సమకూడినవి అయితే మన కార్యకలాపాలలోని లోపాలనుకూడా మనం పరిశీలించుకోవాలి. కొంతమంది పార్టీ సభ్యులు తత్వశాస్త్ర, సామాజికశాస్త్రాలలో విద్వత్ అధ్యయనమంతా కేవలం తమ గుత్తసొమ్ము అన్నట్లు వ్యవహరించారు; తాముచెప్పినది యావత్తూ సరియైనదేనన్నట్లు ప్రవర్తించారు. ఇతరులలోని సుగుణాలను గుర్తించ నిరాకరించారు. అసలు ఇతరులలోకూడా కొన్ని సుగుణాలుంటాయన్న విషయాన్ని వారు పూర్తిగా మరచిపోయారు. ఇతరులు తమను విమర్శించితే, దానిని సహించలేక మండిపడ్డారు. కేవలం తాము మాత్రమే బుద్ధికి బృహస్పతులమన్నట్టూ, ఇతరులందరూ తమ శిష్యపరమాణువులన్నట్టూ వారు వ్యవహరించారు. అసలు ఇతరులందరూ కేవలం భావవాదులనీ, బూర్జువాపండితులనీ, కలకాలం అలాగేవుండిపోతారనీ ఆ పార్టీ సభ్యులు భావించారు. వీరిది చాలా ప్రమాదకరమైన ధోరణి. వ్యవహారం ఇంకాకొంతకాలంపాటు ఇలాగేసాగితే, ఈ పార్టీ సభ్యులంతా పతనంచెందటం తథ్యం; మనదేశంలో తత్వశాస్త్రం, సామాజికశాస్త్రాలు ఏమాత్రం అభివృద్ధిచెందవు; అవి నిర్జీవంగా తయారుకాకమానవు. ఈ కామ్రేడ్స్ ఇకనైనా ఆత్మస్తుతిపరాయణత్వాన్ని తక్షణం విసర్జించాలి; వినమ్రులై మెలగాలి. ఇతరుల విమర్శలకు చెవియొగ్గాలి. పార్టీ వెలుపలగల ప్రజలనుంచి నేర్చుకోటా

నికి ప్రయత్నించాలి. తత్వశాస్త్రం, సామాజికశాస్త్రాలలో మనం సాగించే కృషిలోని లోపాలను సరిదిద్దుకొనేందుకు వారు ఇతరులతో నిజంగా సహకరించేందుకు యత్నించాలి.

మన దేశంలో ప్రజారాజ్యం స్థాపితమై ఇప్పటికి దాదాపు ఏడేళ్ళవుతోంది. భావవాద ఆలోచనా ధోరణినీ, బూర్జువా భావాలనూ పట్టుకు వ్రేలాడుతున్న వారు యిప్పటికీ కొంతమంది వున్నప్పటికీ, చాలా మందిలో గొప్పమానసిక పరివర్త నచ్చిందనే చెప్పాలి. తత్వశాస్త్ర, సామాజిక శాస్త్రాల పరిశోధన మన బోధనా రంగాలలో మనం క్రమక్రమంగా ఎప్పటికప్పుడు మన శక్తులను పునస్సమీకరించుకుంటూ వుండాలి. అసలు మొదటి నుంచీ లోప భూయిష్టంగా వుంటూ వచ్చిన పద్ధతులను, చర్యలను విడనాడాలి. ఒకప్పుడు సరియైనవే అయినప్పటికీ, యిప్పుడు కాలదోషం పట్టిన వాటిని కూడా మార్చుకోవాలి. ఈ రంగాలలో మనకృషి పూర్తిగా సాఫల్యం పొందేటట్లు జూసేనిమిత్తం నిర్మాణాత్మక శక్తులన్నింటినీ మనం సమీకరించాలి. అందుకు పైన పేర్కొన్న చర్యలు గైకొనాలి. విషయ పరిజ్ఞానానికి సంబంధించిన వాటిలో తత్వశాస్త్ర సామాజిక శాస్త్ర శాఖలు చాలా ముఖ్యమైనవి; కనుక ఈ రంగాలలో మనం సాగించవలసిన కృషికూడా చాల ముఖ్యమైనదే.

ఈ సందర్భంలోనే ఆధునిక చరిత్రను గురించి ప్రస్తావిస్తాను: సామాజిక శాస్త్రశాఖలలో ఆధునిక చరిత్ర అత్యంత ముఖ్యమైనది. అయినప్పటికీ గత కొలది సంవత్సరాలలో ఈ శాఖలో మనం గణనీయమైన విజయం సాధించనేలేదని చెప్పాలి. పార్టీ చరిత్రకు సంబంధించిన పాఠ్యగ్రంథా నొకదానిని కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ఎప్పుడు తయారు చేస్తుందా అని కొందరు ఎదురుచూస్తున్నట్టు వింటున్నాను. ఆ పాఠ్యగ్రంథాన్ని ఆధారం చేసుకొని, ఆధునిక చరిత్ర గ్రంథాలను రచించవచ్చునని కూడా వారు అనుకొం టున్నట్లు తెలుస్తోంది. దయయుంచి అలా ఎదురుచూడటం ఇక నైనా మానండి. కేంద్రకమిటీ పాఠ్యగ్రంథాన్ని దేనినికూడా

తయారు చేయబోవటం లేదు. పార్టీకి సంబంధించిన ఘటనలవరుస క్రమాన్ని, అధికార పత్రాల సంపుటిని మాత్రమే కేంద్రకమిటీ ప్రకటించబోతున్నది. అందుచేత, ఆధునిక చరిత్ర విషయంలో ప్రత్యేక పరిశోధన సాగిస్తున్నామనే విద్వత్ప్రముఖులు ఇకనైనా ఆధునిక చరిత్రకు సంబంధించిన వివిధ సమస్యలను స్వతంత్రంగా పరిశీలించడానికి ఉపక్రమించాలి. ఆధునిక చరిత్ర పరిశోధన విషయంలోకూడా, విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి అన్న సూత్రం వర్తింపచేయాలి; అదితప్ప మరొకసూత్రం వర్తింపచేయటానికి వీలు లేదు. ఒంటెత్తుపోకడకు స్వస్తిచెప్పండి; మనతో సహకరించటానికి సిద్ధంగావున్న వారితోను, సహకరించటానికి వీలున్న వారితోను సమైక్యంకండి. అన్నిటిపైనా గుత్తాధిపత్యం సంపాదించుకోవాలన్న తృష్ణను చంపుకోండి. అసంజసమైన నిబంధనలకు, అసంబద్ధమైన ఆదేశాలకు తక్షణం స్వస్తిచెప్పండి. అనేక రకాల పుష్పాలను వికసించనీయండి, విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి అన్న సూత్రాన్ని అమలుజరపండి. కేవలం మీమీ శాఖల ప్రయోజనాలను గురించి మాత్రమే ఆలోచించకండి. ఇతరులకు, ఇతర శాఖలలో పనిచేస్తున్నవారికి ఇతోధికమైన చేయూత నిచ్చేందుకు ప్రయత్నించండి. అహంభావపు వాదులు కావద్దు; పొరపాటులకు అతీతులమని భావించకండి; భ్రమించకండి. వినమ్రతను, అణకువను అలవర్చుకోండి. ఇతరులను గౌరవించటం నేర్చుకోండి. ఐక్యతాసాధనకు మనం సాగిస్తున్న కృషిలో అడ్డంకులుగా వున్నవాటిని ఆ విధంగా మనం చక్కదిద్దుకోవాలి. ఐక్యతను పటిష్ఠవంతం చేయాలంటే పైన పేర్కొన్నవిధంగా మనం వ్యవహరించాలి.

## మేధావులతో సన్నిహిత సంబంధాలు

సన్నిహితమైన ఐకమత్యాన్ని సాధించే విషయంలో పార్టీ సభ్యులుకాని రచయితలు, కళాకారులు, శాస్త్రవేత్తలు కూడా

తగినంత శ్రద్ధ చూపగలరనే ఆశిద్దాం. చౌ ఎన్ లై సమర్పించిన "మేధావుల సమస్యపై నివేదిక"లోని ఒక భాగాన్ని ఈ సందర్భంలో పునరుద్ఘాటించదలచాను :

"కొంతమంది మేధావులకు, మన పార్టీకి మధ్య యింకా కొంత ఎడంవుందని యింతకుముందే చెప్పాను. ఈ ఎడం లేకుండా చేయటానికి మనం చొరవతీసుకోవాలి. ఈ ఎడం వుండటానికి సాధారణంగా ఉభయులు బాధ్యులే. ఒకవైపున మన కామ్రేడ్స్ మేధావుల దగ్గరకు వెళ్లి, వారిని అర్థంచేసుకోటానికి ప్రయత్నించటం లేదు. మరొకవైపున కొంతమంది మేధావులు యింకా సోషలిజం పట్ల లేనిపోని అనుమానాలు వ్యక్తంచేస్తున్నారు; వారిలో కొందరు సోషలిజాన్ని వ్యతిరేకిస్తున్నారుకూడా. మన పారిశ్రామిక సంస్థల లోను, ప్రభుత్వ కార్యాలయాలలోను, పాఠశాలలోను, మొత్తం సమాజంలోను అలాంటి మేధావులు కొందరున్నారు. మిత్రులెవరో, శత్రువు లెవరో వారు గ్రహించలేక పోతున్నారు. కమ్యూనిస్టు పార్టీకి, కొమింటాంగ్‌కు మధ్యగల తేడాను వారు గుర్తించ లేక పోతున్నారు. చైనాప్రజలకు, సామ్రాజ్యవాదానికిగల వ్యత్యాసాన్ని వారు గ్రహించలేక పోతున్నారు. అందుచేత ప్రభుత్వమూ, పార్టీ అనుసరిస్తున్న విధానాలపట్ల, అవి అమలుజరుపుతున్న చర్యల పట్ల వారు అసంతృప్తిని వెల్లడిస్తున్నారు. పెట్టుబడిదారీ విధానాన్ని, చివరకు ఫ్యూడలిజాన్ని పట్టుకొని వారు వ్రేలాడుతున్నారు. సోవియట్ యూనియన్‌పట్ల శత్రుత్వం పూని, సోవియట్ యూనియన్‌నుంచి నేర్చుకోవటానికి నిరాకరిస్తున్నారు. మార్క్సిజం - లెనినిజాన్ని అధ్యయనం చేయటానికి నిరాకరిస్తున్నారు; పైగా దానిని హేయభావంతో చూస్తున్నారు. శ్రమైకజీవనాన్ని, శ్రమజీవులను వారు యీసడించుకొంటున్నారు. కార్మిక - కర్షకులతో గానీ, రైతుకుటుంబాలనుంచి వచ్చిన ప్రభుత్వోద్యోగులతో గానీ కలిసి మెలసి తిరగటానికి నిరాకరిస్తున్నారు. ప్రవర్థమానమవుతున్న నూతనశక్తులను గుర్తించ నిరాకరిస్తున్నారు.

అలాంటివారు ప్రగతిశీలురందరినీ అవకాశవాదులుగా పరిగణిస్తు న్నారు. తరచు వారు పార్టీకి, మేధావులకుమధ్య, చివరకు మేధా వులమధ్యనే తంపులు, తగవులు పెట్టుతున్నారు. వారిలో అహం భావం అపారంగా వుంది. ప్రపంచమంతటిలోకి తాము మాత్రమే ఉత్తమోత్తములమని వారు భ్రమిస్తున్నారు. ఇతరుల నాయ కత్వాన్నిగానీ, విమర్శననుగానీ వారు అంగీకరించరు. ప్రజల ప్రయో జనాలను, మొత్తం సమాజంయొక్క ప్రయోజనాలను వారు తమ దృష్టిలోకి తీసుకోటమే లేదు. ప్రతివిషయాన్ని స్వీయప్రయోజనం దృష్ట్యాఆలోచిస్తారు. స్వీయప్రయోజనాలకులాభదాయకమైనదానిని మాత్రమే వారు ఆమోదిస్తారు; లాభదాయకంగా లేని ప్రతిదానిని వ్యతిరేకిస్తారు. ఈ అవగుణాలన్నీగల మేధావులు ఈనాడు బహు అరుదుగా మాత్రమే వున్నారనుకోండి. అయితే వీటిలో ఏదో ఒక అవగుణంగలవారి సంఖ్య ఏమంత తక్కువగా లేదు. మధ్యతరహా గ్రూపుకుచెందిన మేధావులలోని కొందరిలోకూడా సంకుచిత మన స్తత్వం, అహంకారం, ప్రతిదానిని స్వార్థచింతనతోనే చూడటం వంటి అవలక్షణాలు లేకపోలేదు. అలాంటి మేధావులు తమదృష్టిని మార్చుకోకపోతే, మనం వారికెంతదగ్గరగా వెళ్ళినా, వారికి, మనకు మధ్య కొంత ఎడం యింకా వుండనే వుంటుంది."

అంటే, పార్టీ సభ్యులు, అదేవిధంగా పార్టీ సెలుపలగల వారు కూడా ఐక్యతను పటిష్ఠవంతం చేయటానికి భగీరథ ప్రయ త్నం చేయవలసి వుంటుం దన్నమాట.

కళావేత్తల్లోను, సాహితీపరుల్లోను, విజ్ఞానవేత్తలలోను కూడా వ్యక్తిగత అహంభావం, సంకుచిత మనస్తత్వం కన్పిస్తాయి. ఎంతోకాలం శాస్త్రపరిశోధన చేస్తున్నవారికీ, ఇటీవలనే శాస్త్ర పరిశోధన ప్రారంభించినవారికీమధ్య పరస్పర అవగాహనలోపిస్తోంది. ఇవన్నీ కడుశోచనీయమైన విషయాలు. వీటన్నిటినీ మనం విసర్జిం చాలి. విసర్జించగలమన్న నమ్మకం నాకుంది. పార్టీ సభ్యులు

ఆదర్శప్రాయంగా ప్రవర్తిస్తే, పార్టీ వెలుపలగల వారితో కలిసి కష్టించి పనిచేస్తే ఈ సమస్యను సునాయాసంగా పరిష్కరించగలం.

## విమర్శ : అధ్యయనం

ఇక విమర్శ విషయంలో, అనేక రకాల పుష్పాలను వికసించనీయండి, విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి అన్న మన విధానంలోని ఆంతర్యమేమిటి ? విమర్శించటానికీ, ప్రతి విమర్శ చేయటానికీ స్వేచ్ఛ ఒసగటమే దాని అర్థం.

ఈనాటి మన విమర్శలో కొంతభాగం ఉరుములు, మెరుపుల తరహాలో సాగుతోంది; మరికొంతభాగం నీరు, పాలు కలయికవలె వుంటోంది. అయినప్పుడు ఈ సమస్యను పరిష్కరించటమెలా ?

విమర్శ రెండు రకాలుగా వుంటుంది. ఒకటి శత్రువులపై సాగించే విమర్శ; ఈ విమర్శ ఎడా పెడా, చావుదెబ్బ తీసేదిగా వుంటుంది. కాగా, నిజంగా తెలియక పొరపాటుపడినవారిని మందలించే పద్ధతి మరొకరకం విమర్శ. ఇది సహృదయంతోను, సహచర భావంతోను సాగించే విమర్శగా వుంటుంది. ఈ విమర్శ ధ్యేయం ఐక్యతా సాధన; పోరాటంద్వారా ఐక్యతను సాధించటమే దీని లక్ష్యం. రెండో రకం విమర్శ చేసేటప్పుడు ప్రతివారు మొత్తం పరిస్థితినంతా దృష్టిలో వుంచుకోవాలి. ప్రతి విమర్శ హేతువాదనా పటిమతో కూడి వుండాలి; ఇతరులకు చేయూత నివ్వటం కోసం కృషి చేయాలి. లూసన్ రచించిన "ఆహ్‌క్యు యథార్థ గాథ"లోని "నకిలీ విదేశీభూతం" పాత్రవలె "పో, వెధవా, విప్లవంతో నీకేమిపని" అన్న వైఖరిని విమర్శకు లెవ్వరూ అవలంబించరాదు. *

---

* చైనా గోర్కీ అని ప్రసిద్ధికెక్కిన లూసన్ (1881-1936) రచించిన "ఆహ్‌క్యూ యథార్థగాథ"లో నాయకుడు "ఆహ్‌క్యు" ఒక కుగ్రామంలో ఏపని దొరికితే ఆ పని చేసుకుంటూ, ఏ రోజుకూలి ఆరోజు సంపాదించుకొంటూ జీవించే వాడు. 1911 విప్లవకాలంలో తాను విప్లవంలో పాల్గొనాలన్న అభిలాష అతనికి

అయితే, పైన పేర్కొన్న రెండురకాల విమర్శలకూ వర్తించే ఒక విషయం వుంది. జాగ్రత్తగా అధ్యయనం చేసిన పిమ్మటనే ఎలాంటి విమర్శనైనా చేయవలసి వుంటుంది. ఎక్కడో ఏదోలోపం కన్పించగానే, అమాంతంగా, గబగబా విమర్శవ్రాసి అచ్చుకు యివ్వరాదు. బాగా పరిశోధించిన పిమ్మట, ఒకటికి పది మార్లు ఆలోచించినపిమ్మట విమర్శనను ప్రకటించాలి.

విమర్శలో దూషణ తప్పనిసరిగా గర్భితమైవుంటుందన్న భావం పూర్తిగా పొరపాటు. మేము యేనాన్‌లోవున్న సమయంలో వాంగ్ షీవీ అనే విప్లవ ప్రతీఘాతకుడువుండేవాడు. అటు తర్వాత హు ఫెంగ్ అనే మరొక విప్లవప్రతీఘాతకుడు తటస్థించాడు. వారిద్దరూకూడా తమ వ్యాసాలద్వారాను, ఇతర పద్ధతులద్వారాను పార్టీని, ప్రజాప్రభుత్వాన్ని దుయ్యబట్టుతూవచ్చారు. అలాంటి విప్లవప్రతీఘాతకులపైన మనం చావుదెబ్బపై చావుదెబ్బ తీయటం పూర్తిగా సమంజసమైన విషయమే. అయితే మనలోనే – ప్రజలలో – కొందరిపైన అలాంటి పద్ధతులు ప్రయోగించటంమాత్రం పూర్తిగా పొరపాటవుతుంది.

నిజంగా తెలియక పొరబడిన వారిపై విమర్శచేసేవారు ఈ క్రింది నాలుగు వ్యాసాలు తప్పక చదవాలని నా సూచన: (1) "అధ్యయన పద్ధతిని సంస్కరించండి" (మావో సేటుంగ్) (2) "పార్టీలో కార్యవిధానాన్ని సంస్కరించండి" (మావో సేటుంగ్) (3) "పార్టీ పడికట్టు పదజాలాన్ని ప్రతిఘటించండి" (మావో సేటుంగ్) (4) "శ్రామికవర్గ నియంతృత్వాన్ని గురించిన చారిత్రకానుభవంపై వ్యాసం (పీపుల్స్ డెయిలీ). మొదటి మూడు వ్యాసాలు తీవ్రమైన తప్పిదాలు చేసిన ఇద్దరు కామ్రేడ్స్‌ను

---

కలిగింది. అప్పుడు అతడు స్థానిక భూస్వామి కొడుకు, మూకో విప్లవవాదినైన చీన్ గ్రామానికి వెళ్ళి సుసూ అనేగా "పో, వెనవా, విగ్రహంతో నీకేమిటని" అని కసురుతాడు; చీన్ విదేశీయుని శైలి సోషలిస్టు, విదేశీ పద్ధతులను అలవర్చుకొన్నాడు కనుక, అతనిని వూళ్ళోవాళ్ళంతా "నకిలీ విదేశీ భూతం" అని అనుకొనేవారు.

వాంగ్ మింగ్, పోకూలను ♦ విమర్శిస్తూ వ్రాసినవి. కాగా, నాలుగో వ్యాసం కామ్రేడ్ స్టాలిన్‌ను విమర్శిస్తూ వ్రాసినది. కామ్రేడ్ స్టాలిన్ అపూర్వమైన సేవచేసినవ్యక్తి; ఆ వ్యక్తే అత్యంత తీవ్రమైన పొరపాట్లుకూడా చేశాడు. ఈ కామ్రేడ్ చేసిన పొరపాట్లుకన్నా సాధించిన విజయాలు అధికం. ఈ వ్యాసాలను చదివితే ఒక విషయం సుబోధక మవుతుంది. హద్దుమీరకుండా, మితిమీరకుండా, అదేసమయంలో నీళ్ళునమలకుండా ఎలా విమర్శించవచ్చో ఆ వ్యాసాలు నిరూపిస్తున్నాయి. అలాంటి విమర్శ అనేకమందికి ఉపయోగకరంగా వుంటుంది. ఈ వ్యాసకర్తలు విమర్శచేసేముందు ఎంత జాగ్రత్తగా, కూలంకషంగా విషయాలన్నింటినీ పరిశీలించి మరీ విమర్శలను కాగితంపై పెట్టారో చూడండి. సరిగా ఇలాంటి తరహా విమర్శననే మనం ప్రోత్సహించాలి.

## విజ్ఞానశాస్త్రం, కళ

శాస్త్ర, కళారంగాలలో శిఖరాగ్రాలను అందుకోటం ఎంతో కష్టంతో కూడుకొన్నపని. వాస్తవిక విషయాలతో కిందా మీదా పడుతూ క్రమంగా పైకిపోతుండాలి. అంతేకాని, అడ్డదారిన ఎక్కుదామంటే సాధ్యంకాదు. మన శాస్త్రవేత్తలకు, కళాకారులకు, సాహితీపరులకు మనం శాయశక్తులా, అన్నివిధాల సహాయం చేయాలి. మన సామాజిక వ్యవస్థలో చిత్తశుద్ధితో కష్టపడి పని చేస్తున్న శాస్త్రవేత్తలకు, కళాకారులకు ఒసగవలసింది సహాయమే కాని, చావుదెబ్బలు కాదుగదా! క్లిష్టమైన, సృజనాత్మకమైన

---

♦ కామ్రేడ్స్ వాంగ్ మింగ్ (చెన్ షావోవు) పోకూలు 1931–1935 మధ్య కాలంలో కమ్యూనిస్టుపార్టీ నాయకులుగా వ్యవహరిస్తూ, పిడివాద సూత్రాలకు దాసులై తీవ్రమైన అనేక అతివాద తప్పిదాలు చేశారు. ఇందుకు సంబంధించిన వివరాలు "మనపార్టీ చరిత్రకు సంబంధించిన కొన్ని సమస్యలపై తీర్మానం"లో లభించగలవు. (మావో సేటుంగ్ సెలెక్టెడ్ వర్క్స్ సంపుటి 4) 1946 ఫిబ్రవరిలో కామ్రేడ్ పోకూ చుంకింగ్‌నుంచి విమానంలో బయలుదేరి యేనాన్ వస్తుండగా దారిలో ప్రమాదానికి గురియై చనిపోయాడు.

కృషిలో నిమగ్నమై, స్వతంత్ర ఆలోచనచేసేటప్పుడు ఎవరైనాసరే అసలెప్పుడూ పొరపాట్లు చేయకుండా వుండటం దుర్లభం. ఎవరైనాసరే తాము సముపార్జించుకొన్న విషయపరిజ్ఞానంలో లొసుగులున్నందువల్లనే వారు పొరపాట్లుచేస్తారు. రెండవకారణం: ఒకానొక సరియైన విషయాన్ని సర్వకాలాలకు పనికివచ్చే చిర సత్యంగా వుత్ప్రేక్షించినందువల్లకూడా పొరపాట్లు జరుగుతాయి. ఒకసందర్భంలో లెనిన్ ఇలా అన్నాడు: "...ఒక చిన్న అడుగు ముందుకువేస్తేచాలు–అది పైకిమాత్రం అదేదిశలోవేసే అడుగుగా కన్పించవచ్చు – సత్యం అసత్యంగా పరిణమిస్తుంది." (అతివాద కమ్యూనిజం–ఒక బాలారిష్టం; లెనిన్ సెలెక్టెడ్ వర్క్స్, సంపుటి:2, పేజీ 433) అభ్యుదయకరమైన ప్రతిదానిని హృదయపూర్వకంగా బలపరిచే అనేకమంది నిజాయితీపరులుకూడా ఈ రకమైన పొర పాట్లు చేయటంకద్దు. వారుకాస్త తొందరపాటుతో వ్యవహరించ టమే అందుకు కారణం. మూడవ కారణం: భావవాద దృక్పథం గల కొందరు పొరపాట్లుచేస్తుంటారు. ఇందులో అబ్బురమేమీ లేదు. ఎందుకంటే "మానవ గ్రాహ్యశక్తి సూటిగా పయనించదు; వంకర టింకరగా, వలయాకారంలో పరిభ్రమిస్తూ, సుడులు తిరుగుతూ ముందుకు సాగుతుంది. ఈ ఆవర్తనా రేఖలో ఏదో ఒక ఖండ భాగాన్ని తీసుకొని, (కేవలం ఖండదృష్టితో చూస్తూ) స్వయం పూర్ణమైన, పరిసమాప్తమైన సరళరేఖగా (సమ్యక్ దృష్టిలోపించిన పక్షంలో) పరిగణించవచ్చు. నీవు అలా పరిగణించితే పాలకవర్గాల వర్గ ప్రయోజనాలను పరిరక్షించే) దిక్కుతోచని వూబిలో కూరుకు పోతావు; మతైక తుల్యమైన అయోమయావస్థలో పడిపోతావు" (లెనిన్ తాత్విక గ్రంథాలు; పేజీ 330) మానవ గ్రాహ్యశక్తి గతిలో మానసికమైన సోమరిపోతుతనం, ఏ అంశానికి ఆఅంశాన్నే వేరుచేసిచూసే పొరపాటు చేయటం (దీనినే "వూబిలో దిగబడటం" అనవచ్చు), ఖండసత్యాన్ని మాత్రమే చూపటంవంటివన్నీ భావ వాద భూయిష్టమైన పొరపాట్లు చేయటానికే దారి తీస్తాయి.

## పొరపాట్లయెడ అనుసరించవలసిన వైఖరి

వ్యక్తులు నిజంగా తమకు తెలియకుండానే పొరపాట్లు చేయటం సర్వసామాన్యమైన విషయం. అసలు పొరపాట్లుచేయని వ్యక్తి అంటూ ఎవరూ వుండరు. ఇలాంటి పొరపాట్లు చేసేవారికీ, బుద్ధిపూర్వకంగా విప్లవానికి వ్యతిరేకంగా ప్రకటనలు చేసేవారికీ మధ్యగల స్పష్టమైన తేడాను మనం గుర్తించాలి. తెలియక పొరపాట్లుచేసినవారిని బాగుపర్చాలన్న దృష్టితో మాత్రమేవారిని మనం విమర్శించాలి; విమర్శ సహాసశీలంతో కూడినదై, సహేతుకమైనదై వుండాలి. వారిని విమర్శించే టప్పుడు మొత్తం పరిస్థితి నంతటినీ దృష్టిలో వుంచుకోవాలి; సన్నైక్యతాభావంతో, ఐక్యత సాధించాలన్న సంకల్పంతో వ్యవహరించాలి. తప్పులుచేసిన వారందరినీ సరిదిద్దటంకోసం మనం చేయగల్గిన సహాయమంతా చేయాలి. విమర్శకు గురియైనవారు భీతిల్లకుండా చేయాలి.

పొరపాట్లు చేయటం చాలా తేలిక. అయితే వాటిని తక్షణం సరిదిద్దుకోవాలి. ఎంత త్వరగా సరిదిద్దుకొంటే అంత మంచిది. చేసిన తప్పులను పట్టుకొని వ్రేలాడటంవుంది చూశారూ, అదే చాలా హానికరమైన జబ్బు. విమర్శకు గురిచేయబడినవారు తాము చేసినది సరియైనదని నమ్ముతున్న పక్షంలో తనను సమర్థించుకో వచ్చు; ఇతరుల విమర్శలో సభూయిష్టంగా వుందనుకొంటే, దానితో ఏకీభవించటం లేదని ప్రకటించవచ్చు. అలా చేసిన విమర్శ సమంజస మైనప్పుడు మాత్రం నీ తప్పును నీవు సరిదిద్దుకోవాలి; వినమ్ర భావంతో ఇతరుల విమర్శను స్వీకరించాలి. ఎలాంటి అరమరలు లేకుండా చేసిన పొరపాట్లు ఒప్పుకోటం, ఆ పొరపాట్లు చేయటానికి గల మూలకారణాలను తొలగించుకోటం, ఏ పరిస్థితులలో ఆ పొర పాట్లు జరిగాయో పరిశీలించుకోటం, ఆ పొరపాట్లను చక్కదిద్దు కోటానికి మార్గాలేమిటాయని సాకల్యంగా చర్చించుకోటం – ఇదే

రాజకీయపార్టీల పరిపక్వతకు గీటురాయి. ఏ వ్యక్తియొక్క వాస్తవిక దృష్టికైనా అదే గీటురాయి. పొరపాటుచేసినప్పుడు ఇతరుల విమర్శను అంగీకరించటంఅంటే ఇతరుల సహాయాన్ని స్వీకరించటం తప్ప వేరుకాదు. పొరపాటుచేసిన వ్యక్తి తనతప్పులను చక్కదిద్దుకోటానికి సహాయపడటంతోపాటు మనదేశంలో కళలు, సాహిత్యం, శాస్త్రాల అభివృద్ధికికూడా విమర్శతోడ్పడుతుంది. అయినప్పుడు అది ఏ విధంగాను కూడా చెడుకాబోదుగదా !

## మార్క్సిజాన్ని అధ్యయనం చేయవలసిన పద్ధతి

అధ్యయనానికి సంబంధించినంతవరకు, యిచ్ఛాపూర్వక ప్రాతిపదికపై మార్క్సిజం - లెనినిజాన్ని అధ్యయనం చేసేటట్లు చూడాలి. అదే సమయంలో మనం బహుముఖమైన లోకజ్ఞానాన్ని అలవర్చుకోవాలి. గతంలోని విషయాలను, వర్తమానకాలంలోని విషయాలనుకూడా మనం విమర్శనాత్మక దృష్టితో పరిశీలించాలి; అలాగే ఇంటా బయటా విషయాలను కూడా పరిశీలించవలసి వుంటుంది. మిత్రులనుంచీ శత్రువులనుంచీకూడా మనం నేర్చుకోవాలి.

మన మేధావులలో అనేకమంది మార్క్సిజం - లెనినిజాన్ని సమధికోత్సాహంతో అధ్యయనం చేస్తున్నారు. అది హర్షదాయకమైన సంగతి. మానవ విజ్ఞాన నిధియొక్క సారాంశమే మార్క్స్, లెనిన్ మహాశయుల శాస్త్రీయ సిద్ధాంతాలు; సర్వే సర్వత్రా వర్తింప చేయటానికి వీలైన సిద్ధాంతాలు అవి. మార్క్సిజం - లెనినిజం చైనాకుమాత్రం వర్తించబోదని ఒకప్పుడు కొందరు భావించారు. అలాంటి భావాలు కలవారు వట్టి అవివేకులని యిప్పుడు స్పష్టంగా తేలిపోయింది. శాస్త్రీయమైన మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంత కరదీపిక సహాయం లేకుండా, చైనాలో విప్లవాన్ని విజయవంతమొనర్చటం దుర్లభమైన, దురూహ్యమైన

విషయం. అలాగే ఆ కరదీపిక సహాయం లేకపోతే, నిర్మాణ కృషి లోను, శాస్త్రీయ, సాంస్కృతిక కృషిలోను మనం ఇంతటి ఘన విజయాలను సాధించ గలిగేవాళ్లమూ కాదు.

మార్క్సిజం – లెనినిజాన్ని అధ్యయనం చేయటంలో మనం యిప్పటికీ యింకా కొన్ని పొరపాట్లు చేస్తూనేవున్నాం. పడికట్టు సూత్రాలను వల్లించేధోరణి యిప్పటికీ మనలో ప్రధానలోపంగానే వుంటోంది.

పదిహేనేళ్ళకుపూర్వం, 1941 మే మాసంలో, "పార్టీ యొక్క అధ్యయనపద్ధతిని సంస్కరించండి" అంటూ కామ్రేడ్ మావోసేటుంగ్ ఒక వ్యాసంవ్రాశారు. అటుతర్వాత 1942 ఫిబ్రవరిలో, "పార్టీలో కార్యవిధానాన్ని సంస్కరించండి" "పార్టీ పడికట్టు పదజాలాన్ని ప్రతిఘటించండి" అంటూ ఆయన మరి రెండు వ్యాసాలువ్రాశారు. యేనాన్‌లో పార్టీకృషిని మెరుగు పర్చటంకోసం సాగిన ఉద్యమసందర్భంలో ఈ మూడు ప్రధాన వ్యాసాలుచక్కని ఆయుధాలుగా ఉపయోగించాయి. స్వీయమానసిక ధోరణికి పడికట్టు సూత్రాలను వల్లించే ధోరణికి వ్యతిరేకంగా సాగించబడిన ఒక సిద్ధాంత ఉద్యమం అది. 1919 "మే నాలుగు" ఉద్యమం తర్వాత మన దేశంలోని విజ్ఞాన రంగంలో సాగించ బడిన గొప్ప మార్క్సిస్టు – లెనినిస్టు ఉద్యమం అది. బూర్జువా ప్రజాతంత్ర విప్లవం కొనసాగుతున్న సమయంలో పడికట్టు సూత్రాలను వల్లించే ధోరణి మూలంగానే చైనా విప్లవం దాదాపు విచ్ఛిన్నమయిందని చెప్పవచ్చు. పడికట్టు సూత్రాలను వల్లించే ధోరణి మార్క్సిజం – లెనినిజానికి అప్పుడూ, యిప్పుడూ కూడ ఆగర్భశత్రువే. గతంలో మనం గడించిన బాధాకరమైన ఆ అనుభవాన్ని ఎన్నడూ మరచిపోరాదు. విద్వత్ అధ్యయనం పడికట్టు సూత్రాలను వల్లించే పద్ధతిలో కొనసాగితే, కళాత్మక కృషి, సాహిత్యకృషి, శాస్త్రపరిశోధనకృషి తప్పుమార్గం పట్టటం తథ్యం; ఈ విషయాన్ని మనం సదా గుర్తుంచుకొంటుండాలి.

విషయాలను వాస్తవిక దృష్టితో పరికించాలనే మార్క్సిస్టు - లెనినిస్టు దృక్పథానికి పడికట్టు సూత్రాలను వర్ణించే దృక్పథం పూర్తిగా విరుద్ధమైనది.

రచయితలు, కళాకారులు, శాస్త్రవేత్తలు అయిన మీకు ఈ సందర్భంలో నేనొకసూచన చేయదలచుకొన్నాను. కామ్రేడ్ మావో రచించిన "పార్టీలో అధ్యయన పద్ధతిని సంస్కరించండి", "పార్టీలో కార్యవిధానాన్ని సంస్కరించండి" "పార్టీలో పడికట్టు పదజాలాన్ని ప్రతిఘటించండి" అన్న మూడు వ్యాసాలను, చైనా కమ్యూనిస్టుపార్టీ 6 వ కేంద్ర కమిటీ 7 వ విస్తృత సమావేశంలో ఆమోదించబడిన "మన పార్టీ చరిత్రకు సంబంధించిన కొన్ని సమస్యలపై తీర్మానం" మీరంతా తప్పక చదవండి. ఈ రంగాలలో పనిచేస్తున్న కార్యకర్త లందరు వాటిని ఒకటికి రెండుసార్లు చదివి పూర్తిగా జీర్ణం చేసుకుంటారనే భావిస్తాను. పడికట్టు సూత్రాలను వర్ణించే ధోరణికీ, మార్క్సిజం-లెనినిజానికీ మధ్యగల తేడా ఏమిటో అర్థమయ్యేదాకా విడిచిపెట్టకుండా వాటిని మీరు చదవండి. తద్వారా మార్క్సిజం - లెనినిజానికి పడికట్టు సూత్రాలను వల్లించే ధోరణి ఎలా ఆగర్భ శత్రువో, దానికి వ్యతిరేకంగా ఎందుకు గట్టిపోరాటం సాగించాలో అర్థం చేసుకోండి.

## విషయపరిజ్ఞానం అలవరచుకోవాలి

బహుముఖమైన విషయజ్ఞానాన్ని మనం అలవర్చుకోవాలి.

వైద్యశాస్త్రం, భూగర్భశాస్త్రం, తత్వశాస్త్రం, చరిత్ర, సాహిత్యం, నాటకం, చిత్రకళ, సంగీతం మున్నగువాటివిషయంలో చైనా అమూల్యమైన సంప్రదాయసిద్ధమైన సంపదను కలిగియుంది. వారసత్వంగా వచ్చిన ఈ సంపద నంతటినీ శ్రద్ధగా పరిశీలించి, విమర్శనాత్మక దృష్టితో పరిగ్రహించాలి. ఇంతకీ ఈ సందర్భంలో

చెప్పవచ్చేదేమంటే, ఈ రంగాలలో మనం చేయవలసినంత కృషి చేయనేలేదు; కృషి సాగించాలన్న గట్టి పట్టుదలకూడా మనలో లేదనే చెప్పాలి. వారసత్వంగా మనకు సంక్రమించిన ఈ జాతీయ సంపదను తక్కువచూపు చూసేజబ్బు యింకా పోలేదు; నిజంగా కొన్ని విషయాలలో ఆ జబ్బు చాలా తీవ్రరూపంలో కూడా వుంది.

వారసత్వంగా సంక్రమిస్తున్న మన జాతీయ సంపదలో ఎలాంటిదానిని ఎలా స్వీకరించాలి ?

వర్తమాన కాలానికి సంబంధించిన ప్రమాణాలను కొలబద్దగా చేసుకొని, సర్వ సమన్వితంగా వుందా లేదా అంటూ ఎంచటం ప్రారంభిస్తే, చివరకు స్వీకరించటానికి మిగిలేది ఏమీ వుండదు. మరొకవైపున వారసత్వంగా సంక్రమించిన సాంస్కృతిక సంపదనంతా కళ్లుమూసుకొని స్వీకరించటమంటే, "పైనాకు చెందిన ప్రతిదీ ఉత్తమోత్తమమైనద"న్న వైఖరిని వ్యక్తం చేయటమే కాగలదు.

మన సాంస్కృతిక సంపద విషయంలో ఈ క్రింది సూత్రం వర్తింపచేయాలని మేము సూచిస్తున్నాం: మంచి మంచి వాటిని జాగ్రత్తగా ఎంచి, మెరుగులుదిద్ది, పెంపొందించండి. ఆ సంపదలోని లొసుగులను, పొరపాట్లను నిశితంగా విమర్శించండి. ప్రస్తుతం ఈ రెండు పనులలో ఏ ఒక్కదానినీ మనం సరిగా చేయలేక పోతున్నాం. అదే మన కృషిలోని లోపం. మన సాంస్కృతిక సంపదలోని ఉత్తమమైన దానినికూడా కళ్లుమూసుకొని త్రోసి పారేసే ధోరణి ఒకటివుంది. ఇటీవల ప్రదర్శితమైన "పదిహేను పైసాలు" అనే కున్‌షాన్ నృత్యనాటికను తిలకిస్తే, కున్‌షాన్ నృత్య నాటికల్లో అసలు మంచిఅన్నదే లేదనేవారి వాదన ఎంతపొరపాటో నిరూపితమవుతుంది. నాటకరంగం విషయంలోనే అలాంటి ధోరణి వ్యక్తమవుతుంటే, ఇక కళలు, సాహిత్యం, శాస్త్రపరిశోధనల విషయం వేరే చెప్పాలా ? వాటి విషయంలోకూడా అలాంటి

తప్పుడు ధోరణే కలదని మనం అంగీకరించక తప్పదు. ఆ ధోరణిని పోగొట్టేందుకు మనం ఉపక్రమించాలి. అదే సమయంలో, మన సాంస్కృతిక సంపదలోని లోపాలను, మరకలను చూసీచూడ నట్లుపోతూ విమర్శించకుండావుండే ధోరణికూడా కొందరిలోఉంది. ఈ దృక్పథం నిజాయితీతోగానీ, చిత్తశుద్ధితోగానీ కూడినట్టిదికాదు. అందుచేత దీనినికూడా మనం మార్చుకోవాలి.

కళలు, సాహిత్యం, శాస్త్ర శాఖలలో పనిచేస్తున్నవారంతా ప్రజలనుంచి నేర్చుకుంటూ వుండాలి. ప్రజలలో వుండే విజ్ఞత ఎంతతోడినా తరగని జల వంటిది. ప్రజలలో యింకా కాన్పించని, చీకటికోణంలో అట్టడుగున పడివున్న విజ్ఞాననిధులు ఎన్నో వున్నాయి. వాటన్నిటినీ త్రవ్వి వెలుగులోకి తేవాలి; తెచ్చి ఆ నిధులన్నింటినీ చక్కగా ఉపయోగించుకోవాలి. ఉదాహరణకు వైద్యశాస్త్రాన్ని తీసుకోండి. గతంలో నాడ్లింగ్ (సూదిని ఉపయోగించే చికిత్స), కాటరీ (కాల్చిన సాధనంతో చికిత్స)లో ఐతేనేమి, ప్రాణాయామం విషయంలో నైతేనేమి మనం ఈ సడింపు భావం వ్యక్తం చేస్తూ వచ్చాం. ఇప్పుడిప్పుడే మనం వాటిని కూడా పరిగణనలోకి తీసుకొంటున్నాం. కాని, ప్రజా బాహుళ్యంలో విరివిగా ప్రచారంలో ఉన్న ఆస్టియోపతీ (ఎముక విరిగినప్పుడు తోమి సరిదిద్దే పద్ధతి) మర్దనా పద్ధతి, మూలికలద్వారా లభించే ఓషధులను ఉపయోగించే పద్ధతి మొదలైన వాటిపై మనం యింకా తగినంత దృష్టిని ప్రసారించటంలేదు.

సంగీతం, చిత్రకళ విషయమే తీసుకోండి. సృజనాత్మక కృషికి సంబంధించిన ఈ రెండు రంగాలపైన మనం యింకా తగినంతగా దృష్టిని లగ్నంచేయనేలేదు. ఇలాంటి ధోరణులన్నింటినీ మనం సరిదిద్దుకోవాలి.

ప్రజలలో వ్యాప్తిచెందిన విషయాలు చాలావరకు ఒక క్రమ పద్ధతిలో అభివృద్ధికానిమాట నిజమే. వాటిలో కొన్ని ముడి సరుకులవలె వుండేమాటా నిజమే; అవి సిద్ధాంత రుజువులకు

లొంగనిమాటా నిజమే. వాటిలో కొన్ని మూఢ విశ్వాసాలుగా కూడా కన్పిస్తాయి. అందులో అబ్బురమేమీ లేదు. మన శాస్త్ర వేత్తలు, కళాకారులు, రచయితలు వీటిని నిరసించటంమాని, జాగ్రత్తగా పరిశీలించాలి. వాటిలో ఉన్న మంచివాటిని ఎంచి, మెరుగులుదిద్ది, పెంపొందించాలి; శాస్త్రీయమైనవిగా వాటిని అభివృద్ధిచేయాలి.

మన హృదయాలలో జాతీయాభిమానం ఎల్లప్పుడూ పొంగు పొరలు తూ వుండవలసిందే; అయితే మనం జాతీయ దురహంకారులుగా మాత్రం తయారు కాకూడదు. "ఆస్యంతం పాశ్చాత్యమయ మొనర్చాలి" అన్న తప్పుడు ధోరణిని మనం ప్రతిఘటిస్తాం. దాని అర్థం విదేశాలలోని మంచి విషయాలను నేర్చుకోటానికి నిరాక రిస్తామని కాదు. మనదేశం యింకా అత్యంత వళితస్థితిలో వుంది. విదేశాలనుంచి సాధ్యమైనంత ఎక్కువగా నేర్చుకోటంద్వారా మాత్రమే మన దేశం కలిమి, బలములతో తులతూగేటట్లు చేయగలం.

సోవియట్ యూనియన్‌నుంచి నూతన ప్రజాతంత్ర దేశాల నుంచి, సకల దేశాలనుంచి మనం అనేక విషయాలు నేర్చుకో వాలి.

సోవియట్ యూనియన్‌నుంచి నేర్చుకోవాలి – ఇది సరి యైన నినాదమే. మనం ఇంతవరకు నేర్చుకొన్నది బహు స్వల్పం; నేర్చుకోవలసిందిమాత్రం అనల్పంగావుంది. ప్రపంచంలో మొట్ట మొదటగా అవతరించిన సోషలిస్టు రాజ్యం సోవియట్‌యూనియన్. శాంతి, ప్రజాతంత్ర శిబిరానికి ఆ దేశం నాయకత్వం వహిస్తోంది. అత్యున్నత పారిశ్రామికాభివృద్ధిని సాధించిన దేశం అది. అతి ప్రధానమైన అనేక విజ్ఞాన శాస్త్రశాఖలలో బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలనుకూడా తలదన్నుతూ, అది ముందుకు పోయింది. అలాంటి దేశంనుంచి, ప్రజలనుంచి నేర్చుకోటం ఎంతైనా

అవసరం. సోవియట్ యూనియన్‌నుంచి నేర్చుకో నిరాకరించటం శుద్ధ పొరపాటు.

అయితే, సోవియట్ యూనియన్‌నుంచి విషయాలు గ్రహించేటప్పుడు మనం పడికట్టుసూత్రాల పద్ధతిలో యాంత్రికంగా, గుడ్డిగా ప్రతిదాన్నీ సోవియట్ యూనియన్‌నుంచి అనుకరించరాదు. మన దేశంలోని వాస్తవిక పరిస్థితులకు అనుగుణంగా మనం నేర్చుకొను విషయాలను వర్తింపచేసుకోవాలి. ఈ అంశాన్ని మాత్రం ఎల్లప్పుడు గుర్తుంచుకోండి. లేకపోతే ఇబ్బందులలో పడిపోతాం.

సోవియట్ యూనియన్‌నుంచి నేర్చుకోటంతోపాటు, నూతన ప్రజాతంత్ర దేశాలనుంచి కూడా మనం నేర్చుకోవాలి. ప్రతి నూతన ప్రజాతంత్ర దేశమూ ప్రత్యేకమైన సొంత సుగుణాలను కలిగియున్నది. వాటిలో కొన్ని పరిశ్రమలు, సాంకేతిక శాస్త్రం, తదితర విషయాలలో చైనాకన్న ఎంతో పురోభివృద్ధిని సాధించాయి. ఆ దేశాలన్నింటినుంచి నేర్చుకోటం చాలా అవసరం. ఈ సందర్భంలో అహంభావానికి అసలు ఎలాంటి తావు లేదు.

సోవియట్ యూనియన్, నూతన ప్రజాతంత్ర దేశాలు పోను, మిగతా దేశాలలో విభిన్న సామాజిక సంస్థలు, రాజకీయ వ్యవస్థలు అమలునందున్నాయి. సామాజిక సంస్థలు, రాజకీయ వ్యవస్థలు యివ్వాళున్నవి రేపుండక పోవచ్చు. కాని, దేశదేశాలలోని ప్రజలుమాత్రం తమ జీవనయాత్ర సాగిస్తూనే వుంటారు; ముందుకు సాగిపోతూనే వుంటారు. ఎలాంటి హేతువు లేకుండా అలా జరుగుతున్నదనుకోకండి. అందుచేత ఆ దేశాలలోని కళలు, సాహిత్యం, విజ్ఞాన శాస్త్రాలు, ఆ దేశాల ప్రజల సంప్రదాయాలు, ఆచారాలు, ఒక్క మాటలో చెప్పాలంటే అన్ని విషయాలు మనం జాగ్రత్తగా పరిశీలించి, వాటిలోని మంచిని స్వీకరించాలి; ఇక్కడ కూడా ఆధిక్యతా భావానికి తావులేనేలేదు.

సరే, మన మిత్రులనుంచి మనం నేర్చుకొనే విషయం అటుంచండి. మరి శత్రువులనుంచి నేర్చుకొనేమాట ఏమిటి?

వారివ్యవస్థలలోని అభివృద్ధి నిరోధకమైన అంశాలను మన మెన్నటికీ స్వీకరించం. అయితే వారి నిర్వహణా పద్ధతులలోను, సాంకేతిక శాస్త్ర విషయాలలోను గల మంచినంతా గ్రహిస్తాం. మన సోషలిస్టు నిర్మాణాన్ని సాధ్యమైనంత త్వరితగతిని సాధించి, తద్వారా మన బలాన్ని పెంపొందించుకొని, ఆసియాలోను, ప్రపంచంలోను దురాక్రమణ జరగకుండా నిరోధిస్తూ, శాంతిని పదిలపర్చటమే మన ధ్యేయం.

పార్టీ వెలుపలగల ప్రజలనుంచి పార్టీ సభ్యులు నేర్చుకోవలసిన విషయాలను గురించి కూడా నేను కొద్దిగా ముచ్చటిస్తాను.

మనపార్టీ సభ్యులలో చాలామంది తమకు వుండవలసినంత విజ్ఞానంగానీ, విషయ పరిజ్ఞానంగానీ యింకా సంపాదించుకోలేదు. సాధారణంగా నాన్‌పార్టీ ప్రజలలో మార్క్సిజం - లెనినిజానికి సంబంధించిన మూల పరిజ్ఞానం లోపించటంకద్దు. అయితే మన నాన్‌పార్టీ మిత్రులలో అనేకమంది మార్క్సిజం - లెనినిజాన్ని శ్రద్ధగా అధ్యయనం చేస్తున్నారు. ఏది ఏమైనా ఒకటి మాత్రం స్పష్టం. పార్టీ సభ్యులకు, నాన్‌పార్టీ వారికి మధ్యగల ఈ అగాథం ఇక ఎంతోకాలం వుండదు. ఇంతకీ నేను చెప్పవచ్చేదేమిటంటే, పార్టీ సభ్యులు తమలోగల లోపాలను గుర్తించి, వాటిని వెంటనే నివారించుకోటానికి ఉపక్రమించాలి. కమ్యూనిస్టుపార్టీ సభ్యులు కానటువంటి మేధావులలో అనేకమంది ఎంతో కష్టపడి అధ్యయనం చేస్తున్నారు. వారినుంచి నేర్చుకొనటానికి కమ్యూనిస్టుపార్టీసభ్యులు సిగ్గుపడవలసిన పనిలేదు. ఇందుకు ఒకటేమార్గంవుంది: విషయాలు బాగా తెలిసినవారి సలహాలను స్వీకరించాలి. వారినుంచి చిత్తశుద్ధితో వినమ్రభావంతో నేర్చుకొనేందుకు ప్రయత్నించాలి. మన అధ్యయనానికి సంబంధించినంతవరకు ఇది చాలా ముఖ్యమైనఅంశం.

సరే, "అన్నిరకాల పుష్పాలను వికసించనీయండి, విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి" అన్న విధానాన్ని మనం ప్రతిపాదించాం. దీనిని అమలు జరపటంలో ముందు ముందు

అనేక సమస్యలు ఉత్పన్నమవుతాయి. వాటన్నిటిని మనం పరిష్కరిస్తుండాలి. అలాంటి సమస్యలపైన మీలో ప్రతి ఒక్కరు దీర్ఘంగా ఆలోచించగలరనే ఆశిస్తాను. సూత్రాలకు సంబంధించిన విషయాలను గురించి మాత్రమే నేనివ్వాళ ప్రస్తావించాను.

ఒకవేళ నేను చెప్పినదానిలో పొరపాటులేమైనా ఉంటే, మీరు వాటిని సరిదిద్దవచ్చు.

# విభిన్న ఆలోచనాధోరణులమధ్య పోటీ

విద్వత్ రంగంలో విభిన్న ఆలోచనాధోరణులను పోటీ పడనీయటమే తన విధానమని చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఇటీవల స్పష్టంచేసింది. విద్వత్ (ఎకాడమిక్) వర్గాలలో దీనిపై సుదీర్ఘమైన చర్చలు కొనసాగుతున్నాయి. ఈ విషయమై నా అవగాహన ఏమిటో నేనిక్కడ ముచ్చటించదలచాను.

ప్రతి చారిత్రక దశలోను విభిన్న ఆలోచనా ధోరణులు ఒక దానిపై మరొకటి పైచేయి సంపాదించటంకోసం పరస్పరం పోటీ పడుతుంటాయి. ఎలాంటి సమాజంలోనైనాసరే, ఒకానొక చారిత్రక దశ ఏర్పడినప్పుడు, ఆనాటి సాంస్కృతిక జీవనంలో అంతర్భాగంగావుండే విభిన్న ఆలోచనాధోరణులమధ్య పోటీ తప్పనిసరి కాగలదు. ఆ పోటీయొక్క ప్రభావం ప్రజల మనస్సులపై ప్రసరించి, ఎంతో ముఖ్యమైన సామాజిక, ఆర్థిక మార్పులకు కారణభూతమవుతుంది. కేవలం కొత్తభావాలకు, క్షీణభావాలకు మధ్య మాత్రమే ఆ పోరాటం కొనసాగదు; నూతన సమాజాన్ని లక్షించి, అందుకోసం పోరాడేవారిలో వ్యక్తమయ్యే విభిన్న దృక్పథాలమధ్య, ఆశయాలమధ్యకూడా పోరాటం సాగుతూఉంటుంది.

## చారిత్రక సాదృశ్యాలు

రెండువేల సంవత్సరాలక్రితం చైనా సాంస్కృతిక జీవనంలో స్వేచ్ఛాయుతమైనచర్చ అత్యున్నతస్థాయిలో కొనసాగింది. ఆ రోజులు మన చరిత్రకు వసంతఋతువని, ఆకురాలు కాలంఅని చెప్పవచ్చు. ఆ రోజులలో వివిధ రాజరికాల మధ్య శత్రుత్వం భగ

భగ మండుతుండేది. నా దృష్టిలో అదొక చరిత్రాత్మకమైన పరివర్తనదశ. బానిసయుగం భూస్వామిక యుగంగా పరివర్తన చెందిన సంధ్యాకాలం అది. విభిన్న ఆలోచనాధోరణులు ఆ కాలంలో తలెత్తాయి. కన్ఫ్యూషియస్, లావోత్సు, మిసియస్, చువాంగ్‌త్సూ, హస్యూషీ, కుంగ్ సన్‌లుంగ్, హాన్ ఫే వంటివారు ఆ విభిన్న ఆలోచనాధోరణులను వ్యక్తీకరించారు. దాదాపు వారంతా మహాదార్శనికులు; మహాతార్కికులు; ప్రతిభావంతులైన రచయితలు. విభిన్న ఆలోచనాధోరణుల మధ్య, చివరకు ఒకే రకమైన ఆలోచనాధోరణిలోకూడా తీవ్రమైన విద్వత్ (ఎకాడమిక్) చర్చలు కొనసాగాయి. నిజంగా చెప్పాలంటే, ఆ రోజుల్లో వందలాది ఆలోచనాధోరణులు ఒకదానిపై మరొకటి పైచేయి సంపాదించటంకోసం పరస్పరం పోటీ పడ్డాయి. సరిగా అదే కాలంలో, "విభిన్న ఆలోచనా ధోరణులమధ్య పోటీ" అన్న ప్రవచనం ఉత్పన్నమైంది.

ఆధునిక యూరపియన్ చరిత్ర తొలి దశల్లోకూడా, అంటే భూస్వామిక సమాజం పెట్టుబడిదారీ సమాజంగా మారుతున్న సమయంలో పునరుజ్జీవన ప్రాభవమూ, విభిన్న ఆలోచనా ధోరణులు పోటీపడటమూ మనకు గోచరిస్తుంది. అది తొలుత ఇటలీలో ఉద్భవించి, తర్వాత దావానలంలా మొత్తం యూరప్ ఖండాని కంతకూ వ్యాపించింది.

ముప్పై ఏళ్ల క్రితం చైనాలో "మే నాలుగు" ఉద్యమం ప్రారంభమైంది. సాంస్కృతిక దృష్ట్యా చూస్తే, దానిని యూరపియన్ పునరుజ్జీవనోద్యమంతో పోల్చవచ్చు. చైనా భూస్వామిక వ్యవస్థ ఆ మూలాగ్రంగా కుళ్లిపోయి, సమూలమైన మార్పులకు పరిపక్వమైవుంది. అనేకమంది మేధావులు పాశ్చాత్య ప్రజాస్వామిక భావాలను, శాస్త్ర విజ్ఞానాన్ని, అన్నిరకాలైన సోషలిస్టు సిద్ధాంతాలను చైనాలో ప్రవేశపెట్టి, పరిపుష్ట మొనర్చసాగారు: సాంస్కృతిక రంగానికి సంబంధించినంతవరకు ఆనాడు

కూడా విభిన్న ఆలోచనాధోరణులు పోటీపడటానికి అనువైన పరిస్థితు లున్నాయి. అయితే, ఆసమయంలో చారిత్రక క్షీణ శక్తులే యింకా చైనాలో రాజ్యమేలుతున్నాయి. ప్రపంచ పెట్టు బడిదారీ రాజ్యాలు సామ్రాజ్యవాద దేశాలుగా మారిపోయాయి. ఆనాటి పరిస్థితుల్లో చైనా తన జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించు కోటంగానీ, భూస్వామిక, సామ్రాజ్యవాద కబంధ కౌగిలినుంచి బయటపడి, పాశ్చాత్య పెట్టుబడిదారీ ప్రపంచంలోని ప్రజా స్వామ్యాన్ని అనుసరించటంగానీ సాధ్యం కాకుండాపోయింది. రష్యాలో జరిగిన అక్టోబరు విప్లవం అడుగుజాడలలో ముందుకు సాగవలసిన అవసరం, విప్లవ ప్రతీఘాతక సాయుధ ప్రతిఘటనకు వ్యతిరేకంగా సాయుధ విప్లవాన్ని కొనసాగించవలసిన అవసరం కల్గింది. కొమింటాంగ్ అధికారంలో వున్నంతకాలమూ, విభిన్న ఆలోచనా ధోరణులు కలవారు తమతమ అభిప్రాయాలను వ్యక్తీక రించటానికి అవకాశం లేకుండాపోయింది. ప్రజావిప్లవం జయప్రద మైన తర్వాతనే విభిన్న ఆలోచనా ధోరణులు పోటీ పడటానికి అనువైన పరిస్థితు లేర్పడ్డాయి. అప్పుడు మాత్రమే అసలు మనం ఎక్కడ వున్నామో గ్రహించగలిగాము.

## ప్ర త్యే క ల క్ష ణా లు

ప్రతి చారిత్రక పరిణామదశ తన ప్రత్యేక లక్షణాలను కలిగి యుంటుంది; అందుచేత సామాన్యంగా ప్రతీ దశలో సిద్ధాంత పోటీ తప్పనిసరిగా విభిన్నంగా వుంటుంది. అయినప్పుడు ఈరోజున మనం ప్రతిపాదిస్తున్నది ఏమిటి? రెండువేల సంవత్సరాల క్రిందట అనేకమంది మేధావులు దేనినైతే విన్పించారో అలాంటి దానిని గానీ, యూరపియన్ పునరుజ్జీవనంలో సంభవించినదానినిగానీ మనం ప్రతిపాదించబోవటంలేదు.

మనం నివసిస్తున్న వర్తమానదశ తన సొంత విశిష్టలక్షణా లను కలిగియుంది. 'మే నాలుగు' ఉద్యమంకన్నా మనం ఒకడుగు

ముందుకు వెళ్లాం. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, విద్వత్ పరిశోధనలు సాగిస్తున్న వివిధశాఖలు, లేదా ఆయా శాఖలలో పని చేస్తున్న వారు సోషలిస్టుపోటీలో పాల్గొనాలని మనం కోరుతున్నాం. ఎందుకంటే అత్యుత్తమమైన పద్ధతిలో సోషలిస్టు వ్యవస్థను నిర్మించటమే మనం సాగిస్తున్న యావత్ విద్వత్ కృషియొక్క లక్ష్యం.

విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయటం అన్న విషయంలో మన దృక్పథంయొక్క విశిష్టత ఏమిటి? మూడు అంశాలలో తేడా వున్నదని నేను వ్యక్తిగతంగా అభిప్రాయ పడుతున్నాను.

సోషలిస్టు సమాజ నిర్మాణానికి ఉత్తమ మార్గాలు కనుగొనటమే మన యావత్తు విద్వత్ కృషికి లక్ష్యంగావుంది కనుక మనం మార్క్సిజం, లెనినిజాన్ని అధ్యయనం చేయాలి. దానిని చైనా పరిస్థితులకు అన్వయించటానికి ఉత్తమ మార్గాలేమిటా అని పరిశీలించాలి. ఎవరికివారు యిచ్ఛాపూర్వకంగా మార్క్సిజం - లెనినిజంనుంచి నేర్చుకోవచ్చునన్న విషయం వేరే చెప్పనవసరం లేదు. అయితే విద్వత్ గోష్ఠిద్వారా ఎవరైనా తన అభిప్రాయాన్ని నెగ్గించుకోవాలంటేనూ, లోపభూయిష్టమైన సిద్ధాంతాన్ని విసర్జించి హేతుబద్ధమైన సిద్ధాంతాన్ని చేపట్టాలంటేనూ, సత్యాన్వేషణకు ఉత్తమ సాధనంగా నిరూపితమైన మార్క్సిజం - లెనినిజాన్ని సాధన చేసి, అందులో నైపుణ్యాం సంపాదించాలి.

నేను వెల్లడిస్తూన్న ఈ అభిప్రాయంపట్ల కొందరు నైరాశ్యం వ్యక్తంచేయవచ్చు: "అలాగైతే విభిన్న ఆలోచనాధోరణులు ఎలా పోటీపడగలవు?" అని ప్రశ్నించవచ్చు. అందుకు మార్క్సిస్టులమైన మనసమాధానం ఇది: మార్క్సిజం-లెనినిజం అన్నది విశ్వవ్యాప్తంగా అనువర్తనీయమైన సత్యం. ప్రపంచాన్ని ఉన్నదున్నట్లు అర్థంచేసుకోటానికి సహాయభూతమైన, లోపరహితమైన పద్ధతి అది. అయితే, ఏ విద్వత్ సమస్య విషయంలోకూడా ఒక నిర్ణయానికి రావటానికి అదొక తారకమంత్రం అనుకొంటే మాత్రం పొర

పాటు అవుతుంది. మేధావులు మార్క్సిజం - లెనినిజాన్ని శక్తి వంతంగా అన్వయిస్తూ, నిరంతర పరిశోధన, సాధన చేస్తేనే సరియైన నిర్ణయానికి రావటానికి వీలవుతుంది. అందుకు విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడనీయాలి. అంటే, మార్క్సిజం - లెనినిజాన్ని సాధనచేయటం విభిన్న ఆలోచనాధోరణులు పోటీపడటానికి ఆటంకంగామాత్రం వుండదు. చివరకు మార్క్సిజం - లెనినిజాన్ని వ్యతిరేకించే భావవాదులుకూడా తమ వాదనలను స్వేచ్ఛగా వెల్లడించ వచ్చు. తాము చెప్పదలచుకొన్నదానిని నిర్భయంగా ప్రకటించుకోవచ్చు. భావవాదానికి సంబంధించిన అన్నిరకాలైన ఆలోచనా ధోరణులకు మనం సమాధానం చెప్పగలం; వాటినిచూసి భయ పడవలసిన అవసరం ఎంతమాత్రం లేదు. సమర్థనంతుడైన వైద్యుడు రోగినిచూసి, ఆరోగిని పీడిస్తున్నరోగం ఏదైనప్పటికీ జంకడు గదా. స్వేచ్ఛాయుతంగా చర్చలు సాగించటమే మనం అనుసరించ వలసినమార్గం. భావపోరాటం, సిద్ధాంత సమరం సాగించాలి. స్వేచ్ఛాయుతమైన చర్చలు సాగిస్తూ, బూర్జువావర్గంయొక్క భావ వాదాన్ని మనం ప్రతిఘటిస్తాం. విభిన్నఆలోచనాధోరణులమధ్య వివాదం రేగనీయటం అన్నది మన దృక్పథంలోని మరొక విశిష్టత అని నేను అభిప్రాయ పడుతున్నాను.

విభిన్న ఆలోచనా ధోరణులమధ్య వాస్తవికంగా పోటీ జరగాలంటే, మనం మన హృదయాలను విశాల పర్చుకోవాలి; మానసిక ద్వారాలను బాగా తెరవాలి. చైనాలో జరుగుతున్న దేమిటో విస్మరించకుండా, సోవియట్ యూనియన్, నూతన ప్రజాతంత్ర దేశాలనుంచి మనం నేర్చుకోవాలి. సోషలిస్టు నిర్మాణంలో ఆ దేశాలవారు సంపాదించిన అనుభవంనుంచి గుణపాఠాలు స్వీకరించాలి. ప్రపంచ దేశాలన్నింటిలోగల విద్వత్ వర్గాలతో సంబంధాలు పెట్టుకోటానికి మనం ఆతురతచెందుతూ ఉండాలి. ఇటీవలి కాలంలో పెట్టుబడిదారీ దేశాలలో శాస్త్రవిజ్ఞానం ఎంతో అభివృద్ధి చెందింది. ఆ దేశాలనుంచి మనం సంతోష పూర్వకంగా

అనేక విషయాలు నేర్చుకోవాలి. పెట్టుబడిదారీ దేశాలకు చెందిన మూలగ్రంథాలను, వర్తమాన రచనలను, భావవాద సిద్ధాంతాలన్నిటినీ మనం అధ్యయనం చేయాలి. అన్ని దేశాల సంస్కృతి నుంచీ మనం నేర్చుకోన గోరుతున్నాం; అలా నేర్చుకొన్న పిమ్మట స్వేచ్ఛగా చర్చలు జరపాలని అభిలషిస్తున్నాం. విభిన్న ఆలోచనా ధోరణులు పోటీ పడనీయాలి అన్న మన దృక్పథంయొక్క మరొక విశిష్ట లక్షణం ఇది.

పోతే, మన దృక్పథానికి చెందిన మరో విశిష్టలక్షణం ఏమిటో చూద్దాం:

గతంలో, ఏ చారిత్రక దశను తీసుకొన్నప్పటికీ, విభిన్న ఆలోచనాధోరణులు ఒకదానిపై మరొకటి పైచేయి సంపాదించటం కోసం పరస్పరం పోటీ పడటం అన్నది కేవలం సిద్ధాంత చర్చగా మాత్రమే, "కాగితాలపై సాగించే యుద్ధాలుగామాత్రమే" కొన సాగాయి. కాని, మనం యిప్పుడు విభిన్న ఆలోచనాధోరణులను పోటీపడనిస్తూ, ఆయాధోరణుల పాటవాన్ని ఆచరణలో, ప్రణాళికా బద్ధమైన ఆర్థిక నిర్మాణంలో రుజువుచేసుకొనేందుకు అవకాశం కల్పిస్తున్నాం. సిద్ధాంతాన్నీ, ఆచరణనూ చక్కగా సమన్వయపర్చటమే మన విద్వత్ పరిశోధనకు మూలంగా వుండాలన్నవిషయం స్పష్టం. గత కొలది సంవత్సరాలలోను, పారిశ్రామిక నిర్మాణంలో ఉత్పన్నమైన, ఆచరణసంబంధమైన సమస్యలను పరిష్కరించటం పైననే మనం దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించి, ఆచరణీయమైన సాంకేతికశాస్త్రంవైపుకు తక్కువగా మొగ్గుతూ, సిద్ధాంతపరిశోధనను అలక్ష్యంచేశాం. ఈ ధోరణిని మనం విసర్జించాలి. ముందు ముందు వాస్తవమైన సమస్యలెన్నో మనముందు ప్రత్యక్షమవుతాయి. వాటన్నిటిని మనం సులభంగా పరిష్కరించుకోవాలి. అందుకు మనకు కరదీపికగా ఉపయోగపడే ఉత్తమ సిద్ధాంతాన్ని రూపొందించుకోవాలి.

## మనం చేయవలసిన పనులు

ఇంతకు పూర్వపు చారిత్రక దశలన్నిటిలోకంటె, ఈనాడు విభిన్న ఆలోచనాధోరణులను పోటీ పడనీయాలి అన్న ఆదర్శాన్ని మనం బాగా అవగాహన చేసుకొన్నాం. మానసిక వికాసానికి అవసరమైన వసతులన్నింటినీ మన ప్రభుత్వం కల్గిస్తున్నది. విభిన్న ఆలోచనాధోరణులను కలిగియున్నవారు తమ భావాలను నిరాటంకంగా వెల్లడించటానికి అవసరమైన పరిస్థితులను అది సృష్టిస్తుంది. అలాంటి పరిస్థితులు ఏర్పడటానికి మనం చేయవలసిందేమిటి ? నా దృష్టిలో ఈ క్రింది పనులను మనం చేయవలసివుంటుంది :

ఒకటి : సర్వసమన్వితమైన, సమగ్రమైన పథకాలను మనం రూపొందించాలి. 1956 పూర్వార్థభాగంలో వందలాది సమర్థవంతులైన చైనా శాస్త్రవేత్తలు, ఉన్నత సాంకేతిక శాస్త్రవేత్తలు కలిసి, సోవియట్ శాస్త్రవేత్తల సహకారంతో రెండు ద్వాదశవర్ష ప్రణాళికలను రూపొందించారు. అందులో ఒకటి ప్రకృతిశాస్త్రాల అభివృద్ధికి ఉద్దేశించబడింది. రెండోది తాత్విక, సామాజిక శాస్త్రాల అభివృద్ధికి సంబంధించినది. మొదటి ప్రణాళికలో షుమారు యాభై విషయాలు వివరంగా పేర్కొనబడినవి; రెండో ప్రణాళికలోదాదాపు 12 విషయాలు ఉదాహరించబడినవి. రానున్న పన్నెండు సంవత్సరాలలో వెలువడే గ్రంథాలు వాటినిగురించి చర్చించేవిగావుండాలి.

ఈ ప్రణాళికలను రూపొందించే టప్పుడు, వర్తమాన చైనా సమాజంయొక్క పరిణామంలో అనివార్యమైన ధోరణులను, విజ్ఞాన శాస్త్ర పరిణామంలో అనివార్యమైన ధోరణులను మనం పరిగణనలోకి తీసుకొన్నాం. ఎందుకంటే, ఒక వైపున చైనా సమాజాభివృద్ధికి అనుగుణంగా విజ్ఞాన శాస్త్రాభివృద్ధినికూడా సాధించాలి; రెండో వైపున మన సమాజం ముందుకు పోవటానికి విజ్ఞాన శాస్త్రాభివృద్ధి ప్రోత్సాహకరంగా వుండాలి. విభిన్న ఆలోచనా ధోరణులు

పోటీ పడేటట్లు ప్రోత్సహించి, విద్వత్ వికాసానికి తోడ్పడటానికి సర్వసమన్వితమైన ప్రణాళికారచన ఒక సాధన. అయితే, కేవలం ఈ రెండు ప్రణాళికలలోను తలపెట్టిన విషయాలకు, కీలక అంశాలకు మాత్రమే మన విద్వత్ పరిశోధన పరిమితమై వుండబోదు. వివిధ శాఖలలో పనిచేసేవారంతా ఎలాంటి వివాదాంశాన్నైనా లేపవచ్చు; ఆ అంశంపై తాము చెప్పదలచుకొన్నది చెప్పవచ్చు. విభిన్న ఆలోచనా ధోరణులమధ్య వివాదాలు లేగకుండా విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి సంబంధించిన ఏ ప్రణాళికనుకూడా అమలు జరపటం సాధ్యంకాదు.

## భౌతికావకాశాలు

రెండు: విభిన్న ఆలోచనా ధోరణులు పోటీపడటానికి అనువైన భౌతిక అవకాశాలను మనం సమకూర్చాలి. విత్తనం ఫలించాలంటే సుక్షేత్రం ఎలా అవసరమో, అలాగే విద్వత్ వికాసానికి సరియైన భౌతిక పరిస్థితులుకూడా తప్పనిసరి. ప్రస్తుతం చైనా విజ్ఞానశాస్త్ర విద్వత్ పరిషత్ 46 పరిశోధన కేంద్రాలను మాత్రమే నిర్వహిస్తోంది; దేశ విముక్తికి పూర్వం వున్న పరిశోధన కేంద్రాలకన్న నాలుగురెట్లు యిప్పుడు అధికంగా వున్నాయనుకోండి. పైగా, మొత్తం పరిశోధన కృషిలో అధికభాగం కళాశాలలలోను, పారిశ్రామిక సంస్థల తరఫున జరుగుతోంది. మనకున్న పరిశోధన కేంద్రాలసంఖ్య బహుపరిమితం; వాటిలో ప్రయోగ పరికరాలు కూడా చాలినంతగా లేవు. అందుకు తగిన కారణాలున్నాయి. పాత సమాజంనుంచి వారసత్వంగా మనకు సిద్ధించిన బలహీనతలలో అదొకటి. ఈ విషయంలో మనం స్వశక్తితో అన్నీ సమకూర్చుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. పరిశోధన కేంద్రాల సంఖ్యను యింతోధిక మొనర్చటానికీ, పరిశోధనాకృషికి అవసరమైన వసతులు సమకూర్చటానికీ, యింకా ఎక్కువ గ్రంథాలు, పరికరాలు సమకూర్చి, శాస్త్రీయ పరిశోధనకు అవసర

మైన చక్కని భౌతిక పరిస్థితులు చేకూర్చటానికీ మన ప్రణాళికలలో అవకాశం వుండాలి; ఈ పనులన్నింటినీ మనం క్రమక్రమంగా సాధ్యమైనంత తక్కువ కాలంలో పూర్తిచేయాలి.

## గ్రంథాలు, పత్రికలు

మూడు: మనం ప్రచురణల విషయంలో చేయవలసింది కొంతవుంది. విభిన్న ఆలోచనాధోరణులు కలవారు వాద వివాదాలను సాగిస్తున్నప్పుడు అదంతా ముఖ్యంగా రచనారూపంలో వ్యక్తంకావలసి వుంటుంది. ఇది సహజం. కలమే వారి ఆయుధం. అందుచేత వాదవివాదాలను బాగా ప్రోత్సహించాలంటే, ప్రచురణలు చాల ముఖ్యమైన విషయంగా వుంటుంది. ప్రతి వాద వివాదానికి సంబంధించిన విభిన్న అభిప్రాయాలను, పత్రికలద్వారాను, గ్రంథాల రూపంలోను ప్రచురణాలయాలు ప్రకటించాలి. అంతేకాక, ప్రచురణాలయాలు విదేశాలలో వెలువడే విద్వత్ విషయిక గ్రంథాలను సాధ్యమైనంత ఎక్కువగా ప్రకటించి పాఠకులకు అందివ్వగల్గాలి. చైనా విజ్ఞానశాస్త్ర విద్వత్ పరిషత్ చే నిర్వహించ బడుతున్న విజ్ఞానశాస్త్ర ప్రచురణాలయం ఇటీవలనే ప్రారంభించ బడింది. మన కృషిలో యిప్పటికీ అదొక బలహీనమైన అంగంగా వుంది. ఈ పరిస్థితిని మార్చివేయాలి. పైగా విదేశ గ్రంథాలను అనువదించి ప్రచురించే విషయంలో మనం గతంలో అవలంబించిన ఒక పొరపాటుధోరణిని తొలగించుకోవాలి. గత కొలది సంవత్సరాలలో మనం ప్రచురించిన 279 విదేశ గ్రంథాలలోను 271 గ్రంథాలు సోవియట్ యూనియన్‌కి చెందినవే. ఇది విచిత్రమైన ఒక నగ్నసత్యం. సోవియట్ యూనియన్ గడించిన అధునాతన అనుభవాన్ని అలవర్చుకోటం మనకెంతేని ఉపయోగకరమన్న మాట నిజమే. అయితే, అదే సమయంలో ఇతర దేశాలు సాధించిన విద్వత్ విజయాలను విస్మరించే ధోరణిని మనం ఇకనైనా విడనాడటం అవసరం.

## స్వేచ్ఛాయుతమైన చర్చలు

నాలుగు: విద్వత్ రంగంలో మనం చర్చలను స్వేచ్ఛగా కొనసాగనీయాలి; వాటిని ప్రోత్సహించాలి. విభిన్నాభిప్రాయాలను వెల్లడించటానికి పూర్తి అవకాశం ఒసగాలి. అన్నిటికంటె ముఖ్యంగా, తొందరపాటుతో గభాలున నిర్ణయాలకు వచ్చే పద్ధతికి స్వస్తిచెప్పాలి. వాద వివాదాలు సాగేటప్పుడు అల్ప సంఖ్యాకులు వెలిబుచ్చే అభిప్రాయాలను గౌరవించాలి. ఎందుకంటే అధిక సంఖ్యాకులు వెలిబుచ్చే అభిప్రాయాలు ఎల్లప్పుడూ సరియైనవిగానే వుంటాయని ఎక్కడా రాసిపెట్టిలేదు. వంద సంవత్సరాలక్రిందట మార్క్సిజాన్ని స్వీకరించినవారు చాల అల్ప సంఖ్యలోనే వుండేవారు. ప్రాచీన చైనా చరిత్రకు సంబంధించినంతవరకు, దశల విభజన విషయంలో నామట్టుకు నేను ఫాన్ వెన్‌లాన్ వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఏకీభవించలేదు. నాతో ఏకీభవిస్తున్నవారు అధిక సంఖ్యాకులుగా లేకపోవచ్చు. అయితే ఉభయ పక్షాలవారు తమ తమ వాదనలను వ్యక్తీకరిస్తూ, ఎదటివారిని తమవైపు తిప్పుకొనే హక్కు వుంది. ప్రకృతి శాస్త్రాల విషయంలో, ప్రతి శాస్త్రవేత్త స్వతంత్రాలోచనతో పరిశోధన సాగించి, తన భావాలను యథేచ్ఛగా ప్రకటించవచ్చు.

గతంలో అనేకశాఖలు విద్వత్ పరిశోధనకు సంబంధించిన సమస్యలపై సంకుచిత మనస్తత్వాన్ని ప్రదర్శించినమాట నిజమే. అయితే గత సంవత్సరం చైనా విద్వత్ పరిషత్‌లో ప్రత్యేక ప్రావీణ్యతగల శాఖలను నెలకొల్పాం. అప్పటినుంచీ సిద్ధాంత వ్యాసాలను చదివే సంప్రదాయాన్ని ప్రవేశపెట్టాం. రానురాను మనం యింకా ఎక్కువ విద్వత్ మహాసభలను జరుపుకొనగల్గుతాం. ఈ సంవత్సర ప్రారంభంలో భాషా శాస్త్రసంస్థ పురావస్తు పరిశోధనా కృషిని గురించి చర్చించేందుకు, చైనాభాషను ప్రామాణీకరించే విషయమై చర్చించేందుకు ఒక మహాసభను ఏర్పాటు

చేసింది. ఈ విధంగా చక్కని విద్వత్ వాద వివాదాన్ని మనం ప్రారంభించామని చెప్పవచ్చు.

## స్వతంత్ర ఆలోచన అవసరం

అయిదు : స్వతంత్ర ఆలోచనను మనం పెంపొందించాలి. 1952 లో మూడు అరిష్టాలకు వ్యతిరేకంగా – ప్రభుత్వ కార్యాలయాలలోను, ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలలోను దుర్నీతి, దుర్వ్యయం, నిరంకుశత్వాలకు వ్యతిరేకంగా–మనం “సన్ ఫన్” ఉద్యమాన్ని ప్రారంభించాం. అదేవిధంగా విద్వత్ ప్రపంచంలో మనం ఒక నూతన “సన్ ఫన్” ఉద్యమాన్ని ప్రారంభించాలని నేను సూచిస్తున్నాను. మనం ప్రతిఘటించవలసిన మూడు అరిష్టాలు ఏమిటి ?

మొదటి అరిష్టం పిడివాదం. పూర్వం గ్రంథపారాయణలో అనేక మంది నేర్పరులుండేవారన్న సంగతి మనకు తెలును. వారు నోరు విప్పితేచాలు వేదాల వల్లెవేత ప్రారంభించేవారు. అసలు తాము దేనిని గురించి మాట్లాడుతున్నారో కూడా ఇతరులకు అర్థం కాకుండా వారు మాట్లాడుతుండేవారు. వారే మన పిడివాదులకు ఆదర్శపాత్రులయ్యారు. వీరు కూడా మార్క్స్, లెనిన్ రచనలలోని భాగాలను ఒక రకమైన తారకమంత్రాలుగా వల్లిస్తుంటారు. మార్క్సిస్టు వాస్తవిక విషయాలను ఆధారం చేసుకొని అంశాలను పరిశీలించవలసి వుంటుందన్న సంగతి వీరికి పట్టదు. శాస్త్రపరిశోధన రంగంలో మానసిక బద్ధకస్తులు మాత్రమే పిడివాదులుగా తయారవుతారు. కష్టపడి పనిచేయటానికి బదులు వారు ఉల్లేఖనలతో మనలను ఉక్కిరిబిక్కిరి చేస్తుంటారు.

అధునాతనమైన సోవియట్ అనుభవాన్ని యాంత్రికంగా అమలుజరపటంకూడా పిడివాదంక్రిందికే వస్తుంది. నవచైనాను చక్కగా నిర్మించుకొనేందుకు మనం సోవియట్ యూనియన్‌నుంచి నేర్చుకోవలసిన విషయాలు చాలా ఉన్నమాట నిజమే. అయితే

చైనాలో సహజసిద్ధమైన సొంత సామాజిక పరిస్థితు లున్నాయన్న విషయం మరచిపోకూడదు. సోవియట్ అనుభవాన్ని జీర్ణం చేసుకొనేటప్పుడు, చైనాలోని యథార్థ పరిస్థితులనుకూడా పరిగణన లోకి తీసుకోవాలి.

అనుభవాన్ని యాంత్రికంగా అమలు జరపటాన్ని, పిడివాదాన్ని, ప్రతిఘటించేందుకు, మనంఅధికారులను గుడ్డిగా పూజించే పద్ధతికి వ్యతిరేకంగా పోరాడాలి. సుప్రసిద్ధ గ్రీక్ తాత్వికుడు అరిస్టోటిల్ ఒక సందర్భంలో ఇలా అన్నారు: "నేను ప్లేటోను ప్రేమించక పోవటంకాదు; అతనికన్నా సత్యాన్ని అధికంగా ప్రేమిస్తున్నాను". చైనాలో తరచు విన్పించే ఈ క్రింది సూక్తినికూడా గుర్తుంచుకోండి: "నా అభిప్రాయం సరియైనదని నేను తెలుసుకున్నప్పుడు, నా గురువువచ్చి చెప్పినా దాన్ని మార్చుకోబోను." దీనిని ఒకటికి మరొకసారి మననం చేసుకోటం మంచిది. వాస్తవమైన విజయాలనుసాధించిన వారిని గౌరవించాలి. వారు సాధించిన విజయాలు గొప్పవి కనుకనే వారిని మనం గౌరవిస్తున్నాం. అయితే గతంలో వారు గొప్ప విజయాలు సాధించారు కనుక వర్తమానంలోకూడా వారు ఎలాంటితప్పులూ చేయబోరని అనుకోవలసిన పనిలేదు. మనం కనుక ఇతరుల పరిశోధన ఫలితాలను, అధ్యయన ఫలితాలను పరిశోధించకుండా, గుడ్డిగా వాటిని అనుకరిస్తే, మన కృషి తప్పనిసరిగా నిష్ప్రయోజనమైపోతుంది; విద్వత్ కృషికి హాని కలుగుతుంది.

## దూరదృష్టి అలవర్చుకోవాలి

రెండవ అరిష్టం: హడావిడితోకూడిన అల్పదృష్టి. విజ్ఞాన శాస్త్రపరిశోధనలో మనం దూరదృష్టిని ప్రదర్శించాలి. మనమిప్పుడు ఇరవయ్యో శతాబ్దంలో నివసిస్తున్నాం. సుదీర్ఘమైన చరిత్ర, సహజసంపద, అపారంగాగల విశాలభూభాగం మనకున్నాయి. మనం పరిశీలించవలసిన అవసరాలు అపారంగా వున్నాయి.

కూపస్థమండూకంలాగా "నూతిలో కూర్చొని ఆకాశం కేసిచూసే" దశ ఏనాడో దాటిపోయింది. అయితే గతంలో కొన్ని శాఖలలో పనిచేసేవారు తక్షణం సాంకేతిక సమస్యలకు మాత్రమే లేనిపోని ప్రాధాన్యమిచ్చి, సిద్ధాంత అధ్యయనాన్ని అలక్ష్యం చేశారు. నా దృష్టిలో హడావిడితో కూడిన అల్పదృష్టి అంటే ఇదే. తీవ్రమైన శాస్త్రీయ పరిశోధనను సాగించకుండా తమ సాంకేతికస్థాయిని పెంపొందించుకోవచ్చునన్న అల్పదృష్టితో అనేకమంది శాస్త్ర వేత్తలు అతిస్వల్పమైన సమస్యల్లో సహితం ముచ్చెమటలుపోసే విధంగా పనిచేసే వైఖరి అది.

బోధనావిషయంలోకూడా యింతే. ఏ ఉపాధ్యాయుడైనా సరే, విద్వత్ పరిశోధన సాగించకుండా తన బోధనాపాటవాన్ని మెరుగుపర్చుకోలేడు. విద్వత్ పరిశోధన అన్నది అసలు బోధనా కృషికి అంతరాయంగా దాపురించిందని భావించిన ప్రబుద్ధులు ఒక సంవత్సరంక్రితందాకా ప్రభుత్వ విద్యాశాఖలో ప్రముఖ స్థానాలను ఆక్రమించుతూ వచ్చారు. అల్పదృష్టికి ఇది మరొక ఉదాహరణ. దేశంలోని అత్యున్నత విద్యాలయాలైన కళాశాల ల్లోనూ, తదితర విద్యాసంస్థల్లోనూ పట్టుదలతో పరిశోధనాకృషిని తక్షణం ప్రారంభించాలి. బోధన, పరిశోధనల మధ్య పనివిభజన సరిగా జరిగితే, చక్కని ఫలితాలనిచ్చే సహకారానికి తావిస్తుంది.

## హానికరమైన ఒంటెత్తుపోకడ

మూడో అరిష్టం : ఒంటెత్తుపోకడ (స్పెక్టేరియనిజం). గత కొలదిసంవత్సరాలలోను విద్వత్ ప్రపంచంలో కృషిచేస్తున్నవారు కేవలం బహుపరిమితంగా వుండే పఠనాకార్యక్రమంలో మాత్రమే మునిగితేలుతూ వచ్చారు. కొన్ని శాఖలలో ఒంటెత్తుధోరణి ప్రబలసాగింది. దీనికి చారిత్రక కారణాలు కొన్ని లేకపోలేదు. చైనాదేశం నిన్నమొన్నటిదాకా అర్థభూస్వామిక, అర్థవలస దేశంగా ఉంటూవచ్చింది. దీనిఫలితంగా విద్వత్ వర్గాలలో విదేశా

లపై మోజు ఏర్పడింది. గతంలో ప్రముఖ చైనామేధావులు అనేకమంది పరభాషలలో గ్రంథాలు రచించి, విదేశాలలో అచ్చు వేయించుకొనేవారు. ఉదాహరణకు చైనా విజ్ఞానశాస్త్ర విద్వత్ పరిషత్ ఉపాధ్యక్షుడైన డాక్టర్ విజుక్వాంగ్ విషయమే చూడండి. విదేశాలలో ఆయన యఎస్. జె. ఎస్. లీ పేరుతో ప్రసిద్ధి కెక్కారు. తనదేశాన్ని సదా ప్రేమించే శాస్త్రవేత్త ఆయన. అయి నప్పటికీ గత సంప్రదాయంయొక్క ప్రభావానికిలోనై, ఆయన "చైనా భూగర్భ విజ్ఞానశాస్త్రం" అన్న సుప్రసిద్ధ గ్రంథాన్ని ఆంగ్లభాషలో ప్రకటించారు. ఆ గ్రంథాన్ని మనం చైనాభాషలో ప్రకటించాలని నిర్ణయించాం. అయితే ఆంగ్లభాషనుంచి చైనా భాషలోకి దానిని తర్జుమా చేయవలసి వచ్చింది. ఆయన దేశ భక్తుడై యుండికూడా, చెడు అలవాటునుంచి బయటపడలేక పోయాడు. ఆనాటి సమాజంలో అదెలా సంభవించిందో మీరంతా యిట్టే వూహించుకోగల రనుకోండి.

చైనా విజ్ఞానశాస్త్ర విద్వత్ పరిషత్ ఇటీవలి కాలంలో పెట్టుబడిదారీ సంస్కృతిని ఆరాధించే పద్ధతికి స్వస్తి చెప్పింది. అయితే అదేసందర్భంలో మనం మరొక అవాంఛనీయమైన పరి స్థితికి వెళ్ళాం. కొంతమంది ఏవోకొన్ని మార్క్సిస్టు, లెనినిస్టు గ్రంథాలను, సోవియట్ యూనియన్ నుంచి వచ్చిన కొద్ది గ్రంథా లను మాత్రమే చదివి సంతృప్తి చెందసాగారు. అంతకు మినహా వారు యే ఇతర గ్రంథాలు చదవనేలేదు. అందుచేత మన శాస్త్ర పరిశోధన కుంటుపడిపోయింది. శాస్త్రపరిశోధన విషయంలో సోవియట్ సాధించిన విజయాలను గురించి మనం తప్పకుండా తెలుసుకోవలసిందే. సోవియట్ విజ్ఞానశాస్త్ర విద్వత్ పరిషత్ విజ్ఞాన సమాచార సంస్థవారు శాస్త్రవేత్తల ఉపయోగార్థం వివిధ దేశాలనుంచి 9 వేల విజ్ఞానశాస్త్ర పత్రికలను తెప్పిస్తున్నారు. చైనా విజ్ఞానశాస్త్ర విద్వత్ పరిషత్ తరఫున ఒక విజ్ఞానశాస్త్ర సమాచారశాఖ యిప్పుడు నెలకొల్పబడుతోంది.

## విద్వత్ పరిశోధన

మనం చేయవలసిన ఆరోపని విద్వత్ పరిశోధనను ప్రోత్స హించటం.

అహంభావాన్ని మనం వ్యతిరేకిస్తాం. అలాగే తమ్ముతాము న్యూనతపర్చుకోటాన్ని కూడా వ్యతిరేకిస్తాం. గతంలో ప్రజలు చైనా మేధావులను తూష్ణీంభావంతో చూస్తుండేవారు; చైనా నిపుణులంటే యిూషణ్మాత్రం గౌరవం చూపేవారుకారు. విదేశాలవారిని ఆరాధించే మన స్తత్వంవల్లనే అదంతా సంభవించింది. కాని మన నూతన సమాజంలో అలాకాదు. శాస్త్రీయ పరిశోధనలో పూర్తిగా నిమగ్నమై కష్టపడి పనిచేస్తున్న వా రందరికీ నేడు గౌరవం లభిస్తోంది. శాస్త్రవేత్తల జీవన స్థితిగతులు బాగుపడుతున్నాయి. విద్వత్ పట్టాలను ప్రదానంచేసే పద్ధతిని ప్రభుత్వం అమలుజరుపుతోంది. నియమబద్ధంగా జరిగే పరీక్షలద్వారా శాస్త్రవేత్తలు డాక్టర్ పట్టాలను, అసోసియేట్ డాక్టరు పట్టాలను పొందవచ్చు. ప్రదానం చేయవలసిన విద్వత్ బిరుదులను గురించి ప్రస్తుతం చర్చలు జరుగుతున్నాయి. త్వరలోనే అవి ప్రకటించబడతాయి. విద్వత్ పరిశోధనలో కృషి చేయదలచుకొన్న వారంధరికీ మన సమాజం సర్వతోముఖమైన ప్రోత్సాహం యిస్తుంది. ఇదే సందర్భంలో ఒకమాట చెప్పటం సముచితంగా ఉంటుందనుకొంటున్నాను. విమర్శకూడా ఒక రకమైన ప్రోత్సాహమేనని గుర్తుంచుకోవాలి. అయితే ఆ విమర్శ నిరుత్సాహపర్చేదిగా వుండరాదు. బిడ్డను తల్లి ఎంత అనురాగంతో మందలిస్తుందో, మనం చేసే విమర్శకూడా అంత ప్రేమపూర్వకమైనదిగా వుండాలి.

ఏడు : ప్రతి మేధావికూడా వారంలో అయిదు రోజులు పరిశోధనకు, అధ్యయన కృషికి వినియోగించగల పరిస్థితులను మనం కల్పించాలి. "మేధావుల సమస్యపై నివేదిక"లో ప్రధాని చౌ ఎన్ లై ఇలా పేర్కొన్నారు: "మేధావులు ప్రతి రోజూ

ఆరింట అయిదువంతుల కాలాన్ని (అంటే వారానికి 40 గంటలు) తమ కృషికి వినియోగించేటట్లు చూడటం అవసర మని కేంద్ర కమిటీ భావిస్తోంది;" ఇంకా స్పష్టంగా చెప్పా లంటే, ప్రతి మేధావి ప్రతి ఆరు రోజులలో అయిదు రోజులు తన పనికి వెచ్చించాలి; మిగతా ఒక్కరోజు మాత్రమే రాజకీయ అధ్యయనానికి, సామాజిక వ్యవహారాలకు, సభలకు వినియో గించాలి. ఇటీవల అనేక శాఖలు తమ కార్యక్రమాలను ఈవిధం గానే తయారు చేసుకొన్నాయి. మిగతా శాఖలు అందుకోసం ఇంకా క్రిందా మీాద పడుతున్నాయి.

ఎనిమిది: విదేశాలతో విద్వత్ విషయిక పరిజ్ఞానాన్ని యితోధికంగా పరస్పరం మార్పిడి చేసుకోవాలి. విముక్తి సాధిం చిన తర్వాత, అంతర్జాతీయ విద్వత్ కార్యకలాపాలను పెంపొం దించటానికి మనం కొన్ని చర్యలు తీసుకొన్నాం. అయితే ఈ విషయంలో మనం సాగించిన కృషి చెప్పుకోతగినంతగా లేదు. కాని, ఈ సంవత్సరంమాత్రం పరిస్థితి కొంత బాగుపడింది. ఏప్రిల్ మాసంలో ప్రపంచ విజ్ఞానశాస్త్రవేత్తల సమావేశం పెకింగ్‌లో జరిగింది. ఆ సమావేశానికి అనేకమంది ప్రపంచ ప్రఖ్యాత శాస్త్ర వేత్తలు అరుదెంచారు. నోబుల్ బహుమతి పొందిన బ్రిటిషు శాస్త్ర వేత్త సి. ఎఫ్. పావెల్ నాలుగు ఉపన్యాసాలు యిచ్చారు. అలాగే మరొక ప్రసిద్ధ బ్రిటిషు శాస్త్రవేత్త డాక్టర్ ఫ్రూస్టర్ కూడా ఎనిమిది ఉపన్యాసా లిచ్చారు. జపాను అణుశాస్త్రవేత్త డాక్టర్ సకతా షాయిఛీ మే, జూన్ మాసాలలో నాలుగు ఉపన్యాసా లిచ్చారు. ఈ ఉపన్యాసాలన్నీకూడా చైనా విజ్ఞాన శాస్త్రాభి వృద్ధికి తోడ్పడుతాయి.

విద్వత్ యాత్ర సాగించేందుకు చైనా రావలసిందిగా ప్రపంచంలోని శాస్త్రవేత్తలందరినీ మనం ఆహ్వానిస్తున్నాం. అలా మన దేశానికివచ్చేవా రందరికీ నిండు మనస్సులతో స్వాగతం పలుకుతాం. అదే సమయంలో అంతర్జాతీయ విద్వత్ మహా

సభలలో మనం శాయశక్తులా కృషి చేయాలి. ఆ మహాసభలలో పాల్గొనటంద్వారా విదేశాలలో సాధింపబడిన ఉత్తమ విద్వత్ విజయాలనుగురించి తెలుసుకొనగల్గుతాం; మనం సాధించినవిజయా లను గురించి యితరులకు తెలియజెప్పనూవచ్చు. ప్రపంచ మంతటాగల విద్వత్ వర్గాలమధ్య విభిన్న ఆలోచనా ధోరణుల మధ్య పెద్ద ఎత్తున పోటీ మనకు గోచరిస్తోంది. ఉపయోగకరమైన ఆ వాద వివాదాలలో పాల్గొని తమ పాత్రను నిర్వర్తించటానికి చైనా మేధావులు సిద్ధంగా వున్నారు.

## స త్యా న్వే ష ణ

తొమ్మిది: మనం పట్టుదలతో ఆత్మ విమర్శనను ఆచ రించాలి; వాస్తవిక విషయాలను ఆధారం చేసుకొని సత్యా న్వేషణ సాగించాలి. విభిన్న ఆలోచనా ధోరణులు పోటీ పడటం, స్వేచ్ఛాయుతమైన చర్చలలో ఒకరినుంచి మరొకరు నేర్చుకోటం సత్యసాధనకు ఉపకరించగలదని మనం భావిస్తు న్నాం. అందుచేత వాద వివాదాలలో పాల్గొనేవారంతా తొట్రు పాటు లేకుండా, ఓర్పుతో వ్యవహరించాలి; వాస్తవిక విష యాలను కనుగొని, సత్యాన్ని తెలుసుకోవాలన్న దృష్టితో వారు పనిచేయాలి. వారు దేనినైతే నిజమని నమ్ముతున్నారో దానికి గట్టిగా కట్టుబడి ఉండాలి. అదే సమయంలో అహంకారానికి లోనుకాకుండా, యితరులు వెలిబుచ్చే అభిప్రాయాలను జాగ్రత్తగా ఆలోచించి, తమ కృషిని మరొకసారి పరిశీలించుకోవాలి. ఆత్మ విమర్శ అంటే అదే. ఎవరైతే తమ లోపాలను గుర్తించ నిరాక రిస్తారో, అలాంటివారు విద్వత్ రంగంలో శిఖరాగ్రం చేరుకోలేరు.

## ప ని వి భ జ న లో మా ర్పు

చివరి విషయం: సహకార ప్రాతిపదికపై మనం పని విభజనను మరింతగా మెరుగుపర్చుకోవాలి.

విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడనీయండి అన్న విషయంలో మన దృక్పథం యింతకుపూర్వంగల దృక్పథా లన్నింటికీ భిన్నమైంది. మన దృష్టిలో పోటీపడటం అంటే విశృంఖలంగా వ్యవహరించటం కాదు. ఏ సమాజంలో ఐతే మనం నివసిస్తున్నామో, ఆ సమాజ స్వభావంలో పోటీపడవలసిన అవసరం వుంది. మన శక్తిస్తోమతులను వృథాకానివ్వరాదు కనుక, సర్వతోముఖ ప్రాతిపదికపై మేధావులమధ్య సరిగా పనివిభజన జరగాలి. అలాగే వివిధ విద్యాలయాల మధ్య, ప్రభుత్వ సంస్థల మధ్యకూడా పనివిభజన సరిగా జరగాలి; దానిని ఖచ్చితంగా అమలు జరపాలి. అయితే ఒక శాఖలో పనిచేస్తున్న మేధావులు ఇతర శాఖలలో జరుగుతున్న కృషిని గురించికూడా తెలుసుకొంటూ వుండాలి. లేకపోతే, తమ శాఖకు సంబంధించిన వ్యవహారాలు తప్ప మిగతాశాఖల వ్యవహారాలు వారికి బొత్తిగా తెలియకుండా పోతాయి. ఈ విధంగా అన్నిశాఖలలోను పనిచేసే మేధావులు పరస్పరం సన్నిహితంగా సహకరించుకొంటూ ఒకరి విషయాలు మరొకరికి తెలియజెప్పుకొంటూ ఉండాలి. అదేవిధంగా ఒకే శాఖలో పనిచేసే మేధావుల మధ్యకూడా సన్నిహితత్వం పెంపొందాలి; ఒకరినుంచి మరొకరు నేర్చుకొంటూ వుండాలి. వివిధ శాఖలలో పనిచేస్తున్న మేధావులు పరస్పరం సహృదయంతో విమర్శించుకొంటూ, మన విద్వత్ అభివృద్ధికి తోడ్పడాలి. నా దృష్టిలో విద్వత్ సహకారం అన్నది ఒక ఆర్కెస్ట్రావంటిది. రకరకాల వాయిద్యాలన్నీ కలిసి ఒకే శృతి పలకాలి.

## అనంతమైన వాదవివాదాలు

గతంలో విభిన్న ఆలోచనాధోరణులు కొంతకాలంవరకు మాత్రమే పోటీపడుతూ వచ్చాయి. యుద్ధాలలో సతమతమవుతూ వచ్చిన రాజరికాలకాలంలో, అనేకమంది సుప్రసిద్ధ మేధావులు అవతరించి తమ గొంతు విప్పారు. అయితే ఆ పోటీ 200 సంవత్స

రాలు మాత్రమే కొనసాగి, అంతరించిపోయింది. అలాగే యూర పియన్ పునరుజ్జీవనోద్యమ తొలిసంచలనం కూడా 16 వ శతాబ్దం తర్వాత క్రమేణా అంతరించిపోయింది. అందుకు కారణం ఏమిటి? వర్గాలుండే సమాజంలో పాలకవర్గానికీ, పాలితవర్గాలకూ మధ్య ఒక రకమైన నిశ్చితమైన నూతన సంబంధాలు ఏర్పడీ ఏర్పడగానే, తరచు ఒకరకమైన మేధావి పక్షవాతం ప్రబలుతూ వచ్చింది. మన మిప్పుడు కమ్యూనిస్టు వ్యవస్థకు తొలిమెట్టు అయిన సోషలిస్టు వ్యవస్థను నిర్మించుకొంటున్నాం. వర్గాలను రద్దుచేయటంకోసం కృషిచేస్తున్నాం. ప్రజల జీవనస్థితిగతులను మెరుగుపరుస్తూ, మానసిక వికాసాన్ని మనం నిరంతరం క్రమానుగతంగా పెంపొం దిస్తూవుండాలి. మనం ప్రజలకు సేవచేస్తున్నాం; అంతేకాని పాలక వర్గాల సంకుచితప్రయోజనాలకొరకు పాటుబడటం లేదు. అందుచేత మన మేధావివర్గంపైన అంతకంతకు ఎక్కువ బాధ్యతలు పడుతుం టాయి. మనదేశంలో విభిన్న ఆలోచనా ధోరణులు ఒకదానితో మరొకటి నేడేకాక, రేపుకూడా పోటీపడకతప్పదు. ఏ ఆలోచనా ధోరణీ అత్యుత్తమమైనదిగా స్వీకరించబడదు. స్వేచ్ఛాయుతమైన చర్చ నిరవధికంగా సాగిపోతుంది. అందుచేత పక్షవాతం వచ్చే ప్రమాదం ఉండదు. మనం కష్టపడి కృషిచేస్తున్నంతకాలం విభిన్న ఆలోచనాధోరణుల మధ్య పోటీకి అంతంఅంటూ వుండదు.

ప్రతివ్యాసం, ఉపన్యాసం ముగింపులో ఫలానాది "చిర స్థాయి అగుగాక!" అన్న నినాదం యివ్వటం మనకు అలవాటు. నేనూ ఈ వ్యాసం ముగింపులో ఒక నినాదం యివ్వదలచాను. అయితే అందులో అతిశయోక్తి ఏమాత్రం ఉండదు.

"విభిన్న ఆలోచనాధోరణులు ఒకదానితో మరొకటి పోటీ పడనీయాలి___" అన్న మన విధానం చిరస్థాయి అగుగాక!

# కళలు, శాస్త్ర విజ్ఞానంపట్ల అనుసరించదగు విధానంపై చర్చ

('పీపుల్స్ చైనా' పత్రిక 17 వ సంచిక)

"విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి" అంటూ కమ్యూనిస్టుపార్టీ కళలు, శాస్త్ర విజ్ఞానం విషయమై రూపొందించిన విధానాన్ని నేడు చైనా శాస్త్రవేత్తలు, మేధావులు చాల విస్తృతంగా చర్చిస్తున్నారు. అనేక దిన పత్రికలు, మాస పత్రికలు వగైరాల్లో యీ చర్చలు ప్రచురింపబడుతున్నాయి; వివిధరంగాల్లో పనిచేసే శాస్త్రవేత్తలు, విద్వాంసులు, కళాకారులు యీ సమస్యను చర్చించడానికి అనేక సమావేశాలు జరుపుతున్నారు. ఈ విధానం మొత్తం శాస్త్ర విజ్ఞానంపైన, కళలపైన ఎట్టి ప్రభావం కలుగజేస్తుందో, వివిధ రంగాల్లో దాన్ని నిర్దుష్టంగా అన్వయించేటప్పుడు ఉత్పన్నమయే వేర్వేరు సమస్యలపై అదెట్టి ప్రభావం కలుగజేస్తుందో తెలుసుకోడానికి వారంతా తమ దృష్టిని కేంద్రీకరించి పనిచేస్తున్నారు.

## సత్యాన్వేషణ

ఈ విధానం శాస్త్ర విజ్ఞానాన్ని అభివృద్ధి చేయడానికెంతో తోడ్పడుతుందని అందరూ అభిప్రాయపడుతున్నారు. ఉదాహరణకు, పెకింగ్ విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్ర అధ్యాపకుడుగా ప్రసిద్ధి కెక్కిన ప్రొఫెసర్ ఫెంగ్ యూ-లాన్ "అధ్యయన పత్రిక" (స్టడీ మ్యాగజైన్)లో ఒక వ్యాసం వ్రాశాడు. అందులో ఆయన,

శాస్త్రవేత్తలు స్వతంత్రంగా ఆలోచించేటట్లు, స్వేచ్ఛగా చర్చలు జరిపేటట్లు, వివిధ సమస్యలను లేవనెత్తేటట్లు, వాటికి పరిష్కార మార్గాలు సూచించేటట్లు ప్రోత్సహించడమే యీ విధానం యొక్క ముఖ్యోద్దేశమని తెలియ జేశాడు. "ఇది నిజంగా మా అందరికీ ఎంతో ఉత్సాహం కలిగిస్తోంది," అని వ్రాశాడు. అయితే, గతంలో కొందరు శాస్త్రవేత్తలు పిడివాద ధోరణిని ప్రదర్శించిన ఫలితంగా యేర్పడ్డ కొన్ని చిక్కులను కూడా ఆయన పేర్కొన్నాడు. ఆయన యిలా వ్రాశాడు:

"ఉదాహరణకు, పెకింగ్ విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్ర చరిత్రను గురించి విద్యాబోధన చేస్తూ పరిశోధనలు జరుపుతూన్న మేము, మా విద్యార్థులకు బోధించడానికి కొన్ని పాఠాలు తయారుచేసుకొంటూ ఉండేవాళ్ళం కాని, వాటిని ప్రచురించడానికి సందేహించేవాళ్ళం. బహుశా మా వాదనలు సరిగా రూపొందింపబడలేదని సంకోచించడమే దానికి కారణం. పరిశోధనల విషయం కూడా యింతే; మా వాదనలను మార్క్సిస్టు - లెనినిస్టు ప్రమాణ గ్రంథాలు బలపరుస్తున్నాయా లేదా అని మేము నిరంతరం ఆలోచిస్తూ ఉండేవారం. మార్క్సుగాని, లెనిన్‌గాని ఆ రోజుల్లో మా శాస్త్రవిజ్ఞానకృషికి ఏయే సాధన సామగ్రిని ఉపయోగించుకొంటున్నామో, ముఖ్యంగా చైనానుగురించి పరిశోధనలుజరపడంలో ఏయే పద్ధతు లవలంబిస్తున్నామో ముందుగానే తెలుసుకొని, మాకోసం అన్ని హంగులు సమకూర్చిపెట్టగల రనుకోడం హాస్యాస్పదంకాదా? ఇట్టి కార్యవిధానం మా శాస్త్రవిజ్ఞాన కృషికి అంతరాయం కలిగించడమే కాక, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఒక పిడివాదంగా చేసి, దాని అభివృద్ధిని కుంటుపరచింది.

"మార్క్సిజం - లెనినిజంయొక్క మూలసూత్రం సిద్ధాంతాన్నీ, ఆచరణనూ సమన్వయ పరచడం. మార్క్సిజం - లెనినిజం అనే విశ్వమానవ సత్యాన్ని చైనాదేశ పరిస్థితులకు అన్వయించగలిగినప్పుడే, అది మన సమస్యలకు పరిష్కారమార్గం చూపు

తుంది. కాని యిది అంతసులభమైన పనికాదు. వ్యక్తులు వివిధ దృక్కోణాలనుంచి వాస్తవ పరిస్థితిని వీక్షిస్తారు; కొన్ని సూత్రా లను అర్థంచేసుకోడంలో వారి అభిప్రాయా లొకేవిధంగా ఉండక పోవచ్చు. ఈ కారణాలవల్ల వారి అభిప్రాయాలు భేదిస్తూ ఉంటాయి. ఉదాహరణకు, చైనా దేశచరిత్రను వివిధ యుగాలుగా విభజించడంలో అభిప్రాయభేదా లున్నాయి. అవన్నీ సరియైనవిగా ఉండడం అసంభవం; బహుశా అన్ని అభిప్రాయాలూ తప్పు కావచ్చు. సరియైన అభిప్రాయమేదో తెలుసుకోడ మెలాగు? చారిత్రక పరిశోధకులు స్వతంత్రంగా పరిశోధనలు జరిపి, స్వేచ్ఛగా చర్చించిన తర్వాతగాని వాస్తవం తెలియదు. సత్యం అన్నది దానంతట అది కనపడదు; వైరుధ్యాలమధ్య సంఘర్షణ ద్వారానే అది తెలుస్తుంది. పోరాటం, చర్చలద్వారానే సత్యం బయట పడుతుంది; చర్చలు ఎంత యెక్కువగా జరిపితే సత్యం అంత సమ గ్రంగా, అంత స్పష్టంగా మనకు కనిపిస్తుంది. సత్యాన్వేషణకు అంతమంటూ ఉండదు. ఒక సమస్య పరిష్కరింపబడ్డ వెంటనే కొత్తసమస్యలు అనేకం ఉత్పన్నమవుతూ ఉంటాయి. తిరిగి విభిన్న ఆలోచనా ధోరణుల మధ్య జరిగే పోటీవల్లనే ఆ కొత్త సమస్యలు పరిష్కరింప బడతాయి."

## వాదనలకు ఆధారం వాస్తవ విషయాలు

ప్రకృతి శాస్త్ర పరిశోధకులుకూడా యీవిధానాన్ని గట్టిగా బలపరుస్తున్నారు. ట్సింఘువా విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా పనిచేస్తున్న ప్రొఫెసర్ చీన్‌సై - చాంగ్ "పీపుల్స్ డెయిలీ" పత్రి కలో ఒక వ్యాసం వ్రాశాడు. అందులో ఆయన, శాస్త్ర విజ్ఞాన మింతవరకు నిరంతర చర్చలద్వారానే, స్వేచ్ఛాయుతమైన పోటీ ద్వారానే వృద్ధిచెంది పురోగమించిందని నిరూపించాడు. కొపెర్ని కస్, న్యూటన్, ఐన్‌స్టీన్ మొదలైన ప్రఖ్యాత శాస్త్రవేత్తల నిర్ధారణలన్నీ చర్చల ఫలితంగానే నిజమని రుజువయ్యాయి. కాల

దోషంపట్టిన అభిప్రాయాలను ఎప్పటికప్పుడు మార్చుకోవడం ద్వారా, హేతుయుక్తమైన వాటిని స్వీకరించడంద్వారా, తద్విరుద్ధమైన వాటిని విసర్జించడంద్వారా మాత్రమే శాస్త్ర విజ్ఞానం వృద్ధి చెందుతుంది. విభిన్న ఆలోచనా ధోరణులమధ్య పోటీ లేకుండా శాస్త్ర విజ్ఞానం వృద్ధిచెందదు. ప్రొఫెసర్ చీన్ యిలా వ్రాశాడు :

"ప్రకృతి శాస్త్రాలలో వాగ్వాదనలన్నీ ప్రయోగాత్మక పరిశోధనలన్నీ ప్రయోగాత్మక పరిశోధనల ఫలితాలను ఆధారంగా చేసుకోవాలి. 'ప్రమాణాల'ను వల్లించడంవల్ల ఎట్టి ప్రయోజనం కలుగదు. శాస్త్రవిజ్ఞానంలో ఒక వ్యక్తియొక్క అభిప్రాయాలను ప్రామాణికంగా స్వీకరిస్తున్నామంటే, అవి వాస్తవ విషయాలపైన, హేతువాదంపైన ఆధారపడి ఉండడంవల్లనే. పరిశోధనలవల్ల అతనికి కొత్త పరిజ్ఞానం, విస్తృతమైన పరిజ్ఞానం కలుగుతుంది. బహుశా అతనికి యీ రంగంలో యితరులకంటె ఎక్కువ సమగ్రమైన జ్ఞానం ఉంటుంది. కనుకనే అతని అభిప్రాయాలను మనం ప్రమాణాలుగా స్వీకరిస్తాం. కాని తన పరిజ్ఞానాని కతీతంగా మాట్లాడితే మాత్రం అతని అభిప్రాయాలను ప్రమాణాలుగా స్వీకరించం."

## కొన్ని అభిప్రాయ భేదాలు

అయితే, చర్చల కుండవలసిన పరిమితుల విషయంలోను, పోటీలో ఎలాంటివారు పాల్గొనాలనే విషయంలోను, "ఆలోచనా ధోరణి" అంటే ఏమిటనే విషయంలోను గణనీయమైన అభిప్రాయ భేదాలున్నాయి.

ప్రొఫెసర్ ఫెంగ్ యూ-లాన్ తన వ్యాసంలో యిలా వ్యాఖ్యానించాడు:

"విభిన్న ఆలోచనాధోరణులు పోటీపడ్డానికి హక్కు ఉండాలంటే, అర్థరహితమైన ప్రతి అంశాన్నీ సంతోషంగా గుర్తించాలని అర్థంకాదు. భిన్నాభిప్రాయాలకూ, నిరాధారమైన అభిప్రాయా

లకూ భేదంవుంది. 2000 సంవత్సరాల క్రిందటే సుంజ్ఞే అను ప్రఖ్యాత భౌతికవాది ఆలోచనాధోరణి అంటే ఏమిటో, చర్చల సరళి ఎలా ఉండాలో తెలుసుకొనేందుకు ఒక గీటురాయి ఉందని చెప్పాడు. 'ఒక వ్యక్తియొక్క అభిప్రాయం గట్టి ఆధారం కలదై ఉండాలి; ఒక వ్యక్తి చెప్పేవిషయం హేతుబద్ధమై ఉండాలి' అని అతడు చెప్పాడు."

ప్రఖ్యాత గణిత శాస్త్రజ్ఞుడు, చైనా విజ్ఞాన పరిషత్తులో గణిత శాస్త్ర సమితికి డైరెక్టర్ అయిన ప్రొఫెసర్ హువాలూ-కెంగ్ "క్వాంగ్ మింగ్ డెయిలీ"లో యిలా వ్రాశాడు: "సేచ్ఛా యుతమైన చర్చ అనగా అదివరకే గుర్తింపబడ్డ కొన్ని 'ఆలోచనా ధోరణులు' ఉండి తీరాలనే సిద్ధాంతమేమీ లేదు. స్పష్టంగా చెప్పా లంటే, ఒక ఆలోచనా ధోరణి సమగ్రమైన, విస్తృతమైన భావాల సముదాయంగా ఉంటే చాలు; అయితే చర్చల్లో పాల్గొనేవారు కనీసం ఆ విషయంలో సొంత అభిప్రాయాలు గలవారై ఉండాలి. ఒక 'ఆలోచనా ధోరణి' రూపొందడానికి గట్టి కృషి అవసరం. అందుచేత మనమంతా సొంతంగా ఆలోచించడానికి, కష్టపడి పని చేయడానికి పూనుకొందాం. అప్పుడుగాని మన అభిప్రాయాలు ఒక 'ఆలోచనా ధోరణి'గా రూపొందవు.

ఈ చర్చల వివరాలు కొన్ని లక్షల మాటల్లో పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. కొందరు రచయితలు మార్క్సిజం - లెనినిజం అనే కొలబద్ద ప్రకారమే చర్చలు జరగాలా? సింఫోనా వాయించే ఆర్కెస్ట్రా మాదిరిగా వుండలా? అని ప్రశ్నించారు. భావవాదులుకూడా యీ చర్చల్లో పాల్గొనవచ్చునా - మొదలైన సమస్యలను లేవనెత్తారు. ప్రతివిషయంమీద అనుకూలంగాను, వ్యతిరేకంగాను వాగ్వాదాలు జరిగాయి. ఈ చర్చ ఎంతో ఉప యోగకరమైనది. చైనాలో కళాత్మక, శాస్త్రవిజ్ఞాన భావాలు పురోగమించడానికి ఆ చర్చ ఎంతైనాతోడ్పడుతుంది. ఆధునిక చైనా సమాజంలో ప్రజాతంత్ర జీవితం మరింత గాఢంగా వేళ్ళూన

డానికది దోహదం చేస్తుంది. ఇప్పటికీ ఆ చర్చ కొనసాగుతూంది; కొత్తకొత్త అభిప్రాయాలు వెలువడుతున్నాయి. వాటిసారాంశాన్ని క్రోడీకరిస్తూ "పీపుల్స్ డెయిలీ" జూలై 21 వ తేదీ (1956) సంచికలో ప్రచురింపబడ్డ వ్యాఖ్యానాన్ని దిగువ పొందుపరుస్తున్నాం:

## చర్చపై వ్యాఖ్యానం

ఈ రోజున మన విద్వాంసులు "విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడనీయండి" అనే విధానాన్ని చర్చిస్తున్నారు. చాలా మంది తమ అభిప్రాయాలను దిన పత్రికల్లోను, వార, మాస పత్రికలు మొదలైన వాటిలోను ప్రకటించారు. వాటినిబట్టి, అధిక సంఖ్యాకులు యీ విధానాన్ని బలపరుస్తూన్నట్లు స్పష్టమవుతుంది. కాని, అందులో కొన్ని విషయాలపై జరిగిన చర్చలో అభిప్రాయ భేదాలు, అనుమానాలు, భయాలు వెల్లడి అయాయి.

"పోటీ" అంటే అర్థమేమిటి? పోటీకి షరతులేమిటి — అనే ప్రశ్నల పైననే ప్రధాన వాదనలు కేంద్రీకరింప బడ్డాయి. కొందరు, "విభిన్న ఆలోచనా ధోరణులను" పోటీ పడనివ్వాలి గనుక, యిదివరకే గుర్తింపబడ్డ "ఆలోచనా ధోరణులు" గలవారిమధ్యనే పోటీ జరగాలనీ, యితరులు పోటీలో పాల్గొనరాదనీ — వాదించారు. మరికొందరు, కేవలం పోటీచేయడమే చాలదనీ, "చక్కగా" పోటీ చేయాలనీ చెప్పారు. ఇంకా కొందరు, చర్చలో పాల్గొనేవారంతా ఆర్కెస్ట్రా వాయించే వారందరి మాదిరిగా, ఒక సమిష్టిగానం పాడినట్లు చర్చలో పాల్గొనాలన్నారు. ఇతరులు యీ అభిప్రాయంతో ఏకీభవించలేదు. అట్టినిబంధనలు చర్చలో పాల్గొనే వారి స్వేచ్ఛను అరికడతాయని అభిప్రాయపడ్డారు.

## ఎలా పోటీచేయాలి?

మా అభిప్రాయం ఏమంటే: చర్చలో పాల్గొనేవారంతా "చక్కగా పోటీచేయాలి." అని అందరం ఆశించడం న్యాయమే.

ఇది మన స్వేచ్ఛను అరికడుతుందని భావించకూడదు. విభిన్న ఆలోచనా ధోరణుల మధ్య పోటీ విద్వత్‌కృషిని ప్రోత్సహించేదిగాను, సాంస్కృతికాభి వృద్ధిని సాధించేదిగాను ఉన్నత కాలం, యీ విధానం యొక్క పర్యవసానం మొత్తంమీద "చక్కని"దే ఐ యుంటుందని చెప్పవచ్చు. అయితే, మొత్తంమీద ఆ పర్యవసానం చక్కనిదే ఐనప్పటికీ, కొన్ని ప్రతికూలమైన అంశాలు కూడా ఉండడంసహజం. వాటికంటె చక్కని అంశాలు మిన్నగా ఉండే టట్లు, ఇంకా యెక్కువ చక్కగా ఉండేటట్లు మనం చేయదలచు కుంటే, "విభిన్న ఆలోచనా దోరణులను పోటీ పడనీయడం" తప్ప వేరుమార్గంలేదు.

పోటీపడడం సమిష్టిగానం వంటిదికాదు గనుక, వేర్వేరు రాగాలు వినబడకమానవు. విభిన్న ఆలోచనా ధోరణులు గల వారు సొంతంగా తమ గేయాలను తామే తయారు చేసుకొని రావాలి; మరోవ్యక్తి చెప్పినట్లు పాడకూడదు. సంగీతంలో రాగం విప్లవ ప్రతీఘాతకంగా లేకపోయినట్లయితే, పాడే వ్యక్తికి పోటీలో పాల్గొనడానికి స్వేచ్ఛ ఉంటుంది. చర్చా స్వాతంత్ర్యం విషయంలో మే మొక విషయం మాత్రం చెప్పదలచుకున్నాం. చర్చలో పాల్గొనే ప్రతివ్యక్తీ నిజంగా కొంత కష్టపడి విద్వత్ పరిశోధన జరపాలి. ఒకసారి ఎంగెల్స్ శాస్త్రవిజ్ఞానంలో స్వాతంత్ర్యమంటే అర్థం "తాము అధ్యయనంచేయని ప్రతి విషయాన్ని గురించీ వ్రాయ డానికి స్వేచ్ఛ ఉండాలనికాదు." వేర్వేరు ఆలోచనా ధోరణులకు ప్రాతినిధ్యంవహించేవారు, వహించనివారు, "ప్రవీణులు" "పిల్ల కాయలు" కూడా పోటీలో పాల్గొనవచ్చు; అయితేవారు ఆయా విషయాలను కష్టపడి అధ్యయనంచేసిన వారై యుండాలి; వారి అభిప్రాయాలకు గట్టి ఆధారాలుండాలి; హేతుబద్ధమైనవిగా ఉండాలి. వారు చక్కగా పోటీచేయడం ఆహ్వానించదగ్గ విషయమే; కాని అలా చేయకపోయినా ఫరవాలేదు.

చాలామంది "పోటీచేయడం" అంటే "సరిగా పోటీచేయటం" అని అంటున్నారు. ఇందులోకూడా భేదాభిప్రాయా లున్నాయి. కాని, విభిన్న ఆలోచనా ధోరణులు పోటీపడాలి గనుక, అన్ని వాదనలూ సక్రమంగా ఉంటాయని ఆశించకూడదు. "సరిగా" అనే మాటకు అర్థం "చాలామంది ఏకీభవించలేకపోతున్నారు. "అనీ, లేదా "వాదనలు కొత్తవి" అనీ అనుకుంటే బాధలేదు. కష్టపడి అధ్యయనం చేయకుండా, గాలిలో వాదించడం మాత్రం "అపసవ్యమైన పోటీ" అనిపించు కొంటుంది; దాన్ని మనం అంగీకరించకూడదు. సరియైన ఆధారాలు లేకుండా ప్రకటించే అభిప్రాయాలను, హేతుబద్ధంగా లేని వాదనలను యితరులు ఎలాగూ వినరనే మాట వాస్తవం.

## కళాశాలలలో విద్యాబోధన

కళాశాలల్లో చేసే విద్యాబోధనకు కూడా "విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి" అనే సూత్రం వర్తిస్తుందా, వర్తించదా అనేది మరొక వివాదగ్రస్త విషయం. అనేక ఆలోచనా ధోరణులు కళాశాలల్లోనే ఉద్భవించాయని మనందరికీ తెలుసు. కళాశాల విద్యార్థులు యించుమించు స్వతంత్రంగా ఆలోచించగలరని మన మెరుగుదుం. అందుచేత, అధ్యాపకులు తమ పాఠాల్లో భిన్నాభిప్రాయాలను కూడా తెలియజేసి, కొత్త ఆలోచనాధోరణులను ప్రోత్సహించడం, విద్యార్థుల్ని స్వతంత్రంగా ఆలోచించేటట్లు చేయడం - అనుసరణీయం.

వీటన్నిటిలోను మార్క్సిజం యొక్క పాత్ర ఏమిటనే ప్రశ్న వచ్చింది. కొందరు "ఆలోచనా ధోరణులమధ్య పోటీ మార్క్సిజంపై ఆధారపడాలి" అనీ; లేదా "సవ్యమైన, అపసవ్యమైన ఆలోచనా ధోరణికి గల వ్యత్యాసం తెలుసుకోడానికి గతితార్కిక భౌతిక వాదం గీటురాయిగా ఉండాలనీ;" లేదా "మార్క్సిజాన్ని సిద్ధాంత ప్రాతిపదికగా గుర్తించి, దాని కనుగుణ్యంగా మన ఆలోచనా

విధానం ఉండేటట్లు చూడాలనీ – వాదిస్తున్నారు. మన ప్రభుత్వ కార్యకలాపాల్లోను, మన సాంస్కృతిక – శాస్త్రవిజ్ఞాన కృషిలోను మార్క్సిజమే కరదీపికగా ఉందన్నమాట నిజమే. కాని విద్వత్ కృషిలోను, శాస్త్రపరిశోధనల్లోను గతితార్కిక భౌతికవాద పద్ధతిని అవలంబించడాని కిష్టంలేకపోయినా, మార్క్సిజానికి విరుద్ధమైన నిర్ధారణలకు వచ్చినా అందరూ తమతమ అభిప్రాయాలను తెలియజేయడానికి మాత్రం స్వేచ్ఛఉండాలి. అందుచేత, చర్చలో పాల్గొనేవారు మార్క్సిజాన్ని ఆధారంగా చేసుకొని వాదించాలా, సవ్యమైనదేదో అపసవ్యమైనదేదో తెలుసుకోనేందుకు మార్క్సిస్టు పద్ధతిని అవలంబించాలా – అన్నది చర్చలో పాల్గొనేవారి యిష్టాయిష్టాలపై ఆధారపడి యుంటుంది. మనం మాత్రం గతితార్కిక భౌతికవాదంమీద ఆధారపడతాం; ప్రతివారూ గతితార్కిక చారిత్రక దృక్పథాన్నీ, పద్ధతినీ అధ్యయనంచేసేటట్లు, అనుసరించేటట్లు ప్రోత్సహిస్తాం. కాని, గతితార్కిక భౌతికవాదానికి వ్యతిరేకమైన భావాలను పటాపంచలు చేయడానికి మన కెంత స్వేచ్ఛఉందో, గతితార్కిక భౌతికవాదాన్ని విమర్శించ దలచుకున్న వారికి, లేదా అనుమానాలున్న వారికికూడా స్వేచ్ఛ ఉండాలి. చర్చకు భౌతికవాదమే ఆధారంగా, లేక కొలబద్దగా ఉండాలంటే, భావవాదుల్ని పోటీనుంచి తొలగించడమే అవుతుంది. మార్క్సిస్టుల మధ్య అభిప్రాయభేదా లేర్పడవచ్చు; అలాగే మార్క్సిస్టులకూ, వారి మిత్రులకూ మధ్య, లేదా మార్క్సిస్టులకూ భావవాదులకూ మధ్యకూడ అభిప్రాయభేదా లుత్పన్నం కావచ్చు. ఈ అభిప్రాయభేదా లన్నిటికీ వేర్వేరు ఆధారా లుంటాయి; వాటిని పొరపాటుగా ఒకేగాటను కట్టకూడదు.

## లేనిపోని చికాకులు

ఈ విధానాన్ని గురించి అనుమానాలను వెల్లడించినవారి అభిప్రాయాలు ప్రధానంగా యీ రెండు ప్రశ్నల్లో ద్యోతకమవుతున్నాయి.

1. భావవాదాన్ని మనమెందుకు విచ్చలవిడిగా వదలి పెట్టాలి ? అలాచేస్తే సిద్ధాంత రంగంలో గందరగోళం కలుగదా ? 2. అలా చేయడంవల్ల పార్టీ బహుశా తన నాయకత్వాన్ని విసర్జించ వలసిరాదా ?

మొదటి ప్రశ్న అడిగేవారికి మనమిలా సమాధానం చెబుతాం : భావవాదం పైచేయి సంపాదిస్తుందనిగాని, సిద్ధాంత రంగంలో అది గందరగోళాన్ని తెచ్చిపెడుతుందనిగాని ఎవరూ భయపడనక్కర్లేదు. మార్క్సిస్టు సత్యం ఎంతో బలీయమైనదని మనం విశ్వసిస్తున్నాం. అందుచేత అది పోటీలో ఓడిపోతుందని అభిప్రాయపడనక్కర్లేదు. పైగా, మార్క్సిజం మరింత అభివృద్ధి చెందడానికి పోటీ సహాయపడుతుంది. భావవాదానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో మార్క్సిజం ఒక బలీయమైన శక్తిగా యిది వరకే అభివృద్ధిచెందింది. చరిత్ర దీన్ని నిరూపించింది. మనం సిద్ధాంతబలంతో భావవాదాన్ని తప్పక ఓడించగలం. భౌతిక వాదాన్ని ప్రభుత్వ చర్యలద్వారా రక్షించవలసిన అవసరం లేదు.

ఇక రెండవ ప్రశ్నకు వద్దాం : మొదటి విషయమేమంటే, విద్వాత్ కృషిలోను, సాంస్కృతిక రంగంలోను విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడ నివ్వాలనే పార్టీ విధానాన్ని చైతన్య పూరితంగా అమలు జరపడం ద్వారానే, అది తన నాయకత్వ పాత్రను నిర్వహించగల్గుతుంది. రెండవ విషయం, మన విద్వాత్ చర్చ రాజకీయ ఐక్యతపై ఆధారపడి వుంది. శాస్త్ర విజ్ఞాన కృషిలో అన్యోన్యంగా సహకరించుకోడానికిగాని, సమిష్టిగా ప్లానులు తయారుచేసుకోడానికిగాని పోటీ అడ్డురాదు. మూడవ విషయం, విద్వాత్ కృషిలోను, సాంస్కృతిక రంగంలోను మార్క్సిజం ప్రతి సమస్యపైన నాయకత్వపాత్ర నిర్వహిస్తూనే వుంటుంది. ఇదివరకే తేలిపోయిన వాస్తవ విషయం యిది. విద్వాత్ కృషిలోను, సాంస్కృతిక రంగంలోను పార్టీ ఎల్లప్పుడూ మార్క్సిజాన్నే

కరదీపికగా ఉంచుకొని మన కార్యకలాపాలన్నిటినీ నడుపుతూ ఉంటుంది.

## వి మ ర్శ న వి ష యం

ఇక కొన్ని అనుమానాలనుగురించి ప్రస్తావిస్తాను. పొరపాట్లు చేస్తామనే భయం కొందరిలో ఉంది. ఇదే అనుమానాలకు ప్రధాన కారణం. అలా భయపడ్డానికి కొన్ని భౌతికకారణాలు లేకపో లేదు. హూ-ఫెంగ్ అనుచరుల, హూ-షీ అనుచరుల బూర్జువాభావ వాదాన్ని మనం విమర్శించాం. ఆ విమర్శన వారిపట్ల ఎట్టి దాక్షిణ్యాన్ని చూపలేదు; వారిలో అతివికృతంగా ఉన్న అవలక్షణా లన్నిటినీ మనం బహిర్గతం చేశాం; దాన్ని ఒక ఉద్యమంగా కొనసాగించాం. కారణమేమంటే, హూ-ఫెంగ్, హూ-షీ లిద్దరూ మనకు సిద్ధాంత - రాజకీయ శత్రువులు. విమర్శన అలాంటిరూపం కూడా ధరించవచ్చు. అయితే చాలమంది అదొక్కటే విమర్శనా పద్ధతి అని పొరపాటుగా అర్థంచేసుకుంటున్నారు. భావవాద పోకడలు గల ప్రతివ్యక్తీ రాజకీయ శత్రువుఅని తప్పుగా భావిస్తున్నారు. మరో కారణ మేమంటే, యిటీవల కొందరు వ్యక్తిపూజయొక్క, పిడివాదంయొక్క ప్రభావానికి లోనై, సమస్యలను మరీ చులకనగా చూచి ఎదుటివారికి బాధ కలిగించేవిధంగా క్రూరంగా విమర్శించడం అలవరచుకొన్నారు.

ఒక వ్యక్తి తనపై చేయబడిన విమర్శను సక్రమంగాను, మామూలుగాను స్వీకరిస్తే అందరం సంతోషిస్తాం. కాని విద్వత్, సాంస్కృతిక సంస్థల్లో సభ్యులుగా ఉన్నవారు యిప్పటికీ విమర్శలకు అలవాటుపడలేదు. వారిలో కొందరు, విమర్శఅంటే యిల్లుతుడుచుకోడం, మొగంకడుక్కోడంవంటి సామాన్య విషయమనీ, అత్యావసర విషయమనీ తెలుసుకోలేకుండా ఉన్నారు. ఎవరైనా పత్రికల్లో ఒక విమర్శనచేస్తే వారు పెద్ద హంగామా చేస్తారు. నిజానికి ఆ విమర్శ తప్పు అని రుజువైతే అతడు ప్రతివిమర్శచేసి తన వాద

నను బలపరుచుకోవచ్చు; సరియైనదైతే దాన్ని స్వీకరించవచ్చు. హంగామా చేయవలసిన అవసరం యిక ఉండదు.

పోటీ పడ్డ మే విమర్శ

విమర్శఅంటే భయపడేవారికి మన మిలా చెబుతాం: విమర్శకు లోనుగాకుండాఉండే ప్రత్యేక సౌకర్యం ఎవరికీ లేదు. ప్రస్తుతం మన యెదుటఉన్న సమస్య మొత్తంగా విమర్శనే వ్యతిరేకించడంకాదు; క్రూరమైన, అర్థరహితమైన విమర్శను మాత్రమే మనం వ్యతిరేకిస్తాం; విమర్శింపబడే వ్యక్తికి నానావిధాలైన ముద్రలు తగిలించడాన్ని వ్యతిరేకిస్తాం. పరిశోధనల్లోగాని, విద్వత్ విమర్శల్లోగాని ప్రతివారూ వాస్తవ విషయాలనుంచి సత్యాన్ని తెలుసుకోడంలో శాస్త్రీయ దృక్పథం అవలంబించేటట్లు ప్రోత్సహిస్తాం.

శాస్త్ర విజ్ఞానరంగంలో మన ప్రస్తుత విజయాలెంత గొప్పవైనప్పటికీ, మానవ జాతియొక్క ముందు చరిత్రతో పోల్చుకుంటే మన విషయపరిజ్ఞానం బాల్యావస్థలోనే ఉందని తెలుసుకోవచ్చు. శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన ప్రతి శాఖలోనూ మన మింకా పరిష్కరించవలసిన చిక్కు సమస్యలెన్నో ఉన్నాయి. ముందు ముందు కొత్త సమస్యలుకూడా ఉత్పన్నంకావచ్చు. విద్వత్ కృషిలో పాల్గొంటూ, సొంతంగా కొత్త విషయాలను కనిపెట్టదలచుకొనే ప్రతి వ్యక్తీ ధైర్యంతో కొత్త పుంతలుపట్టి, కొత్త మార్గాల్లో పురోగమించాలి. అలాంటిచోట అతడు ప్రకృతియొక్క, సమాజంయొక్క రహస్యాలను లోతుగా తరచిచూడ్డంలో సఫలీకృతుడు కావచ్చు; కాని అనేక కొత్తసమస్యలు అతన్ని గందరగోళపరుస్తాయి; మానవ విజ్ఞానమనే సందుగొందుల్లో దారి తప్పిపోవచ్చు; లేదా భావవాదమనే ఊబిలో దిగబడవచ్చు. మానవ విజ్ఞానం ఎల్లప్పుడూ చారిత్రక పరిస్థితులకు పరిమితమై ఉంటుంది; ఏ యుగానికైనా యిది వర్తిస్తుంది; కమ్యూనిస్టుయుగానికి కూడా

వర్తిస్తుంది. వర్గ దురభిమానమనే సంకెళ్ళను మార్క్సిస్టు పూర్తిగా ఛేదించుకొని విముక్తిని సాధించగలడనే మాట వాస్తవమే; కాని యితర పరిస్థితుల కతడు లోనుగావలసిందే. కొందరు అనుకొంటు న్నంత సులభంగా పరిస్థితు లుండవు. ఉదాహరణకు, భౌతిక ప్రపంచమే ప్రధానమనీ, మానవ చైతన్యం అప్రధానమనీ తెలుసు కున్న తర్వాత, వాస్తవం తెలుసుకున్న తర్వాత భావవాద పొర పాట్లు జరగవని కొందరనుకుంటారు. లేదా మానవజాతి కమ్యూ నిస్టు సమాజంలో ప్రవేశించగానే భావవాదం తుడిచిపెట్టుకు పోతుందని కొందరు అభిప్రాయపడతారు. మార్పు అంత సుల భంగా జరగదు.

## స్వేచ్ఛ సత్యానికి లోబడి వుండాలి

విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడనివ్వాలనే మన విధానం అకస్మాత్తుగా ప్రత్యక్షమైంది కాదు. మన రాజ్యాంగచట్టం ప్రజలకు వాక్స్వాతంత్ర్యం, ప్రచురణా స్వాతంత్ర్యం, శాస్త్ర పరిశోధనా స్వాతంత్ర్యం యిచ్చింది. అందుచేత యీ విధానం పై హక్కులను మరింత అభివృద్ధిచేస్తుంది; మరింత నిర్దుష్ట మొనర్చు తుంది; అంతే.

మన దేశ చరిత్రలో స్వర్ణయుగం, స్వతంత్రరాజుల మధ్య యుద్ధాలుజరిగే యుగం ఉన్నాయి. ఆ రోజుల్లో విభిన్న ఆలోచనా ధోరణులమధ్య తీవ్రమైన పోటీ జరిగింది. అలాగే "మే నాలుగు" ఉద్యమం ప్రజల్లో గొప్ప మనోవికాసం కలుగజేసింది. ఈ రోజున మనం ఒక అద్భుతమైన, అద్వితీయమైన యుగంలో నివసిస్తున్నాం. అనన్య సామాన్యమైన ఒక సంస్కృతిని సృష్టించాలనే మహాదా శయంతో మనం పనిచేయాలి. నేడు మన విద్వత్ ప్రాతిపదిక చాల బలహీనంగా ఉంది; కాని, మన సాంఘికవ్యవస్థ శాస్త్రపరిశోధన కవసరమైన భౌతిక అవసరాలను, స్వేచ్ఛను ప్రసాదించింది. అది ప్రజలకు, సత్యానికి సేవ చేయడాని కవసరమైన నిజమైన స్వేచ్ఛ.

విద్యుత్ కృషి పురోగమించడానికిదొక బలమైన శక్తి. సత్యం కార్మికవర్గ ప్రయోజనాలకు పూర్తిగా అనుగుణంగా ఉంటుంది. ఒకసారి ఎంగెల్స్ యిలా తెలియజేశారు : "శాస్త్రవిజ్ఞానం ఎంత నిర్దాక్షిణ్యంగా, ఎంత నిష్పాక్షికంగా అభివృద్ధిచెందితే, అంతగా అది కార్మికుల ప్రయోజనాలకు, ఆశయాలకు అనుగుణంగా ఉంటుంది." సోషలిస్టు వ్యవస్థలో శాస్త్రవిజ్ఞానం విలసిల్లుతుందనే మన విశ్వాసానికి యిదే భౌతికప్రాతిపదిక.

మన కళాకారులు, శాస్త్రవిజ్ఞానవేత్తలు సోషలిస్టుసమాజ నిర్మాణమనే మహదాశయాన్ని సాధించేందుకు సమైక్యమై, తమ మానసికశక్తుల్నీ, జ్ఞానసంపదనూ సమీకరించి తీసుతారు. ప్రజా బాహుళ్యంకూడా వారితో కలిసి శాస్త్రవిజ్ఞానంపై పురోగ మిస్తారు. అదొక ఉత్తేజకరమైన దృశ్యం. మావ్-సె-టుంగ్ "ప్రపంచదేశాల్లో చైనా ఒక గొప్ప సాంస్కృతికజాతిగా విలసిల్లు తుంది" అని తెలియజేశారు. అలాంటి సోషలిస్టు సాంస్కృతిక వికాసంకొరకు మనం ఎదురుచూదాం.



Price. As. 12.

## తప్పక చదవండి!

చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభ
లీ షావ్-చీ నివేదిక ... 162 పే. 1-0-0

చైనా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక
చౌ ఎన్-లై నివేదిక ... 88 పే. 0-8-0

చైనా కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ సమస్యలు
టెంగ్-సియావో పింగ్ ... 84 పే. 0-8-0

నవచైనాలో నా పర్యటనానుభవాలు
నందిరాజు రాఘవేంద్రరావు 120 పే. 1-4-0
(పోస్టేజి అదనం)





స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ-2.